# ఎనిమిది ప్రతిపక్షాలకు పి. ఎస్. పి. ఆహ్వానం

న్యూఢిల్లీ, మార్చి 14 : పార్లమెంటులోనూ, శాసనసభల్లోనూ కలిసి గ్రూపుగా పని చేయుడానికి అంగీకరించవలసిందని ఎస్ ఎస్ పి, ఫార్వర్డ్ బ్లాక్, రిపబ్లికన్ పార్టీ, ఆర్ ఎస్ పి, పెజంట్స్ అండ్ వర్కర్స్ పార్టీ, బంగ్లా కాంగ్రెస్, డి ఎం కె, జనతా పక్షం (మైసూరు) పార్టీలను ప్రజాసోషలిస్టు పార్టీ నేడు కోరింది

ప్రజాసోషలిస్టు పార్టీలో కలిపి ఈ తొమ్మిది పార్టీలకూ చెందినవారు లోక్‌సభలో మొత్తం 75 మంది సభ్యులున్నారు.

పార్లమెంటులోను, శాసనసభల్లోనూ 'వామపక్ష సంఘటన' ను ఏర్పాటు చేయు డానికి సహాయపడవలసిందని, కమ్యూనిస్టు పార్టీ ప్రధాన కార్యదర్శి శ్రీ సి. రాజేశ్వరరావు పంపిన ఆహ్వానాన్ని తిరస్కరిస్తూ, పి.ఎస్.పి. ప్రధాన కార్యదర్శి శ్రీ ప్రేమ భాసిన్ పై ఎనిమిది పక్షాలకు వ్రాసిన లేఖలతోబాటు మరొక లేఖ వ్రాశారు.

జాతీయతత్వం, ప్రజాస్వామ్యం, మతాతీత వ్యవస్థ, సామ్యవాదాలపట్ల ఒకరకమైన సదుద్దేశాలు కలిగినపార్టీలు, గ్రూపులు, వ్యక్తులతో పార్ల మెంటులో ఒక సంయుక్త పక్షాన్ని ఏర్పాటు చేసేందుకు ప్రయత్నించాలని కోరుతూ, పి.ఎస్.పి. జాతీయ కార్యనిర్వాహక వర్గం చేసిన తీర్మానాన్ని అనుసరించి పై ఎనిమిది పక్షా లకు ఆహ్వానాలు పంపటం జరిగింది.

ఎనిమిది రాష్ట్రాలలో కాంగ్రెస్ పొందిన పరాజయాన్ని గురించి, లోక్‌సభలో కాంగ్రెస్ మెజారిటీ విపరీతంగా తగ్గిపోవటం గురించి శ్రీ ప్రేమభాసిన్ ఆ పార్టీలకు వ్రాసిన లేఖల్లో ప్రస్తావించారు.

సామ్యవాదం వైపుగా ప్రజాస్వామ్య బద్ధంగా సాగించగల పురోగతిలో నమ్మకంగల ఐక్యశుద్ధిగల ప్రత్యామ్నాయశక్తులను ప్రజల ముందుంచటం ప్రస్తుతతరుణంలో అత్యవసర మని పి.ఎస్.పి. విశ్వసిస్తున్నదని. పెక్కు రాష్ట్రాలలో కాంగ్రెసేతర ప్రభుత్వాలు ఏర్ప డిన ఈ తరుణంలో ఈ పక్షాలు నిర్వహించ గల పాత్ర ప్రాముఖ్యం పెరిగిందని శ్రీ ప్రేమ భాసిన్ తమ లేఖలో వివరించారు.

# సివిల్ సప్లయి అధికారుల చర్యలు

## శ్రీ తెన్నేటి విమర్శ

హైదరాబాద్, మార్చి 14 : బియ్యం మూటలు నెత్తిపై పెట్టుకొని పోతున్న ప్రజలపై సివిల్ సప్లయి శాఖ అధికారులు ''అమానుషంగా'' వ్యవహరిస్తున్న విషయాన్ని రాష్ట్ర సివిల్ సప్లయిల మంత్రి శ్రీ వి. బి. రాజు దృష్టికి తెస్తూ పార్లమెంటు సభ్యుడు శ్రీ తెన్నేటి విశ్వనాథం ఆయనకు ఒక లేఖ వ్రాశారు.

మధ్య తరగతివారు, బీద వర్గాల ప్రజ లపై సివిల్ సప్లయి అధికారులు చేయి చేసు కుంటున్నారని కూడా శ్రీ తెన్నేటి తన లేఖలో ఆరోపించారు.

''ప్రజలకు అవసరమైన మేరకుబియ్యం సప్లయిచేయలేకపోతేపోయేవారిపట్ల క్రూరంగా వ్యవహరించకుండా నివారించ వలసిందిగా'' ఆయన కోరారు.

శ్రీ తెన్నేటి తమ లేఖలో ఇలా పేర్కొ న్నారు : ''రైల్వే ప్లాట్‌ఫారముల వద్ద ప్రజలు బియ్యం మూటలు నెత్తిన పెట్టుకొని పోతుండగా వారి పట్ల క్రూరంగా వ్యవహ రిస్తూ, అధికారులు వారిపై చేయి చేసుకొన డం తునిలో నేను స్వయంగా చూశాను. ప్రజలకు బియ్యం సప్లయి చేయలేక పోతే పోయే, ఈ క్రూర చర్యల బారి నుంచిఅయినా వారిని తప్పించవచ్చు.

''గోదావరి — విశాఖపట్నం జిల్లాల మధ్య బియ్యం రవాణాకు ఆంక్షలు లేవని ప్రభు త్వం చెబుతున్నది. కాని ఆహార ధాన్యాలు తీసుకుని పోయే పురుషులు, స్త్రీలు, పిల్ల లపై విచక్షణా రహితంగా చేయి చేసుకొన డం జరుగుతున్నది. చట్టబద్ధమైన రేషన్ షాపులు ఉన్నట్లు పేర్కొనే విశాఖపట్నంలో కూడా రేషన్ కార్డులు కాని, రేషన్ బియ్యం కాని లేని వందలాది మంది ప్రజలు నాకు తెలుసు.

''అందువల్ల దయచేసి, ఈ సమస్యను అధికారుల సౌలభ్యం దృష్ట్యా కాక, మధ్య తరగతి వారు, బీదప్రజల అవసరాలదృష్టిలో పెట్టుకొని పరిశీలించండి—బియ్యం కిలో గ్రాము 120 పైసలు, 150 పైసల ధరకు మాత్రం లభ్యమవుతున్న విషయం బహుశా మీకు తెలిసే ఉండవచ్చు. రాజమండ్రి, విజయ వాడ, ఏలూరు, ఇతర ప్రాంతాలలో కూడా పరిస్థితి ఇదే విధంగా ఉంది.

''అక్రమ నిల్వదారులు ఏ విధంగా మన గలుగుతున్నారు ? ఎవరి సహాయంతోటి ? కాంగ్రెసేతర ప్రభుత్వాలు నెలకొన్న పశ్చిమ బెంగాల్, మద్రాసు, ఇతర ప్రాంతాలలో అక్రమ నిల్వదారులు తమ నిల్వను ఏ విధంగా విడుదల చేస్తున్నారు. ఈ రాష్ట్రంలో ఆ విధంగా జరిగేటట్లు చూడలేరా ?

# నెలాఖరులో ఎ.ఐ.సి.సి.సమావేశం

## కామరాజ్ ప్రకటన

న్యూఢిల్లీ, మార్చి 12 : అఖిల భారత కాంగ్రెసు కమిటీ సమావేశం వచ్చే నెలాఖ రున సమావేశం అవుతుందని నేడు కాం గ్రెసు అధ్యక్షుడు శ్రీ కామరాజ ఇక్కడ ప్రకటించారు.

కార్యవర్గం త్వరలో సమావేశమై ఏ. ఐ. సి. సి. సమావేశానికి ఖచ్చితంగా తేదీని నిర్ణయించగలదని ఆయన అన్నారు.

పార్టీ ఎన్నికలలో బాగా ఓటమి చెం దిన కారణాలను ఏ. ఐ. సి. సి. చర్చిస్తుంది. దేశ ఆర్థిక సమస్యలను ప్రధానంగా ధరల పెరుగుదలను గురించి కూడా చర్చించే అవ కాశం ఉంది.

కాంగ్రెసు కార్యవర్గ సమావేశం తేదీని ఖరారు చేయుటకై ఇంకా నాలుగయిదు రోజులు తాము ఢిల్లీలో ఉండ గలమని శ్రీ కామరాజ పేర్కొన్నారు.

అనంతరం మద్రాసు వెళ్ళగలమని తెలి పారు.

నేడు కాంగ్రెసు పార్లమెంటరీ పార్టీ సమావేశంలో ఆర్థిక కార్యక్రమం, అవులు రెంటికీ సంబంధించి, పునః పరిశీలన జరుగు తుందని శ్రీ కామరాజ అన్న మాటలను ఒక విలేఖరి ప్రస్తావించి, ఈ పునః పరిశీలనను ఏ. ఐ. సి. సి. సమావేశం జరుపుతుందా అని ప్రశ్నించారు.

ఈ విషయం కార్యవర్గం కూడా పరిశీలించ వచ్చునీ ఏ. ఐ. సి. సి. తదుపరి పరిశీలన చేయటం జరుగుతుందని ఆయన సమా ధానం చెప్పారు.

కార్యవర్గం, నాయకత్వపు ఎన్నికలో ఇంత వరకు తీరిక లేక ఈ విషయం చర్చించ టకు వీలు లేక పోయిందని కాంగ్రెసు అధ్యక్షులు ప్రకటించారు.

# ఫ్రెంచి ఎన్నికలు : డిగోల్ వర్గానికి ఒక్క ఓటు మెజారిటీ

పారిస్, మార్చి 13 : ఫ్రాన్స్ సార్వత్రిక ఎన్నికలలో డిగోల్ వర్గం అతి స్వల్ప మీద పార్లమెంటులో ఒక్క స్థానం మెజారిటీ నిలుపుకొనగలిగింది.

మొత్తం 486 స్థానాల్లో స్పష్ట మైన మెజారిటీ రావడానికి అవసరమైన 245 స్థానాలు డిగోల్ వర్గానికి లభించినవి.

అయితే ఇండిపెండెంట్లు పెక్కు మంది డిగాల్ ప్రభుత్వానికి అనుకూలంగా వోటు చేస్తారు కనుక తమకు పరిపాలనా నిర్వ హణకు కావలసిన మెజారిటీ లభ్యం కావడం తథ్యమని సమాచార శాఖా మంత్రి అన్నారు.

ఏ పార్టీకి చెందని 12 మంది ఇండి పెండెంట్లు జాతీయ అసెంబ్లీకి ఎన్ని కైనారు. పాత అసెంబ్లీలో డిగోల్ వర్గానికి 48 స్థానాలు మెజారిటీ ఉంది.

ఫ్రెంచి విదేశాంగ మంత్రి మురివ్‌కేవ్ డి మార్విల్, విదేశాంగ శాఖ సహాయ మంత్రి జీన్‌చార్‌బోపెల్‌లు ఎన్నికలలో ఓడిపోయారు.

''రోజులు మారుతున్నాయి. మనం అను కునేదానికంటె త్వరగా మారుతున్నారు. దయచేసి చేయ గలిగిన విషయాన్ని గురించి పరిశీలించి, ప్రభుత్వం నిల్వల నుంచి బియ్యం మార్కెట్‌లోకి వచ్చేటట్లు చూడాలి. మీ సివిల్ సప్లయి అధికారులను మరింత సౌర ధర్మంతో, ఆచరణాయుత పద్ధతిలో వ్యవహ రించమని, పరిస్థితి తీవ్రతను గమనించ మని దయచేసి సలహా ఇవ్వండి''

# కాంగ్రెసేతర ప్రభుత్వాలపట్ల సానుభూతి, సద్భావం ముఖ్యం

## జయప్రకాశ్ విజ్ఞప్తి: కాంగ్రెసు పార్టీ గుణపాఠం నేర్చుకున్నట్లు లేదని విమర్శ

మిద్నపూర్, మార్చి 13 : ''జాతీయ జీవితంలోని పెక్కు రంగాలలో అవ్యవస్థను వారసత్వంగా'' పొందిన కాంగ్రెసేతర ప్రభుత్వాలు సంక్లిష్టమైన కర్తవ్యాన్ని నిర్వహించవలసి ఉన్నందున, వాటిపట్ల సానుభూతి, సద్భావంచూపి సహకరించటం అవసరమని శ్రీ జయప్రకాశ్ నారాయణ నిన్న ఇక్కడ ఉద్ఘాటించారు.

ఈ రాష్ట్రాలలో కాంగ్రెసు పార్టీ నిర్మాణాత్మకమైన ప్రతిపక్షంగా వ్యవహరించా లనీ, అది కేవలం పార్టీ ప్రయోజనాలను దృష్టిలో ఉంచుకుని పని చేయరాదనీ కూడా ఆయన తిలకేపట్ట ఏర్పాటైన పశ్చిమ బెంగాల్ గాంధి స్మారక నిధి వార్షిక మహా సభలో ప్రసంగిస్తూ అన్నారు.

''అసమర్థమైన ప్రణాళికలు, అభివృద్ధి'' ప్రజలు ఈనాడు ఆర్థికంగా ఎదుర్కొం టున్న ఇబ్బందులకు కారణమని శ్రీ జయ ప్రకాశ్ చెప్పారు.

''ప్రజలతో సన్నిహిత సంబంధం కల కాంగ్రెసేతర ప్రభుత్వాలు, ప్రణాళికలను వాస్తవికతకు అనుగుణంగా రూపొందించి, ముందు జరుగవలసిన పనులు ముందు జరి గేట్లు చూస్తాయని నేనాశిస్తున్నాను. వ్యవ సాయానికి అత్యధిక ప్రాధాన్యం ఇవ్వాలి. పారి శ్రామిక రంగంలో, ఉపాధికల్పన ప్రధా నోద్దేశంగా ఉండే పరిశ్రమలకు ప్రాముఖ్యం ఇవ్వాలి'' అని శ్రీ నారాయణ అన్నారు.

భారతదేశం చిరకాలం మనగలదనే కాక, అంతర్గతంగా దానికి గల జవసత్వాలు సమిష్టి విజ్ఞతకూడా ఈ ఎన్నికలలో నిరూపితం అయినవని ఆయనతెల్పారు. ఆయా పార్టీలు తమ జయాపజయాలను పురస్కరించుకుని ఎలా వ్యవహరించేది కేవలం వాటిపైనే ఆధారపడి ఉంటుందన్నారు.

కాంగ్రెసు పార్టీ ఈనాటికీ అఖిలభారత పక్షాలన్నిటిలోనూ పెద్దదిగా ఉన్నదనీ, అందు వల్ల అది అధికారంలో ఉన్నా, ప్రతిపక్షంగా ఉన్నా, దాని చర్యలు దేశ భవితవ్యాన్ని చాలా వరకు నిర్ణయించగలుగుతాయని వివరిం చారు.

ఎన్నికలనుంచి కాంగ్రెసు పార్టీ సరియైన గుణపాఠాలు నేర్చుకుని ఉన్నట్లు కనిపించక పోవటం విచారకరమని శ్రీనారాయణ అన్నారు.

కాంగ్రెసు పరాజయానికి శ్రీ కామరాజు అన్నట్లు ధరల పెరుగుదల, ఆహార కొరత మాత్రమే కారణం కాదనీ, నిజానికి ఇవి అపసవ్యమైన ప్రణాళికలు, తప్పుడు ఆర్థిక విధానాలకు ఫలితాలు మాత్రమేనని ఆయన తెల్పారు. ''పార్టీ అత్యున్నత వర్గాలలోనూ, పరిపాలనలోనూ అవినీతిని సిగ్గుమాలి సహి స్తూండటం'' కూడా కాంగ్రెసు పరాజయా నికి ఒక ముఖ్య కారణమనీ, అదే అధికార దహానికి దారితీసిందనీ వివరించారు.

పార్టీ వర్గాలలో అవినీతిని నిర్మూలించ డానికి కాంగ్రెసు నిశ్చయించుకున్నదనడానికి గాని, కనీసం అధికార దాహం తగ్గిందన డానికిగాని, ఎలాంటి సూచనలు కనిపించటం లేదని శ్రీనారాయణ అన్నారు. దీర్ఘకాలం అధికారంలో ఉండటంవల్ల కాంగ్రెసు పార్టీ మరొక అవలక్షణాన్ని అలవరచుకున్నదనీ, అల్లరి జరిగితే తప్ప ప్రజాభిప్రాయాన్ని పూర్తిగా నిర్లక్ష్యం చేయటమే ఆ అవలక్షణ మనీ ఆయన వివరించారు.

కొన్ని రాష్ట్రాలలో కాంగ్రెసు పార్టీకి అధికారచ్యుతి కలిగితే, భారత ప్రజాస్వామ్యా నికి, కాంగ్రెసుకు కూడా మేలు జరుగు తుందని సార్వత్రిక ఎన్నికలకు ముందు తాను ఆశాభావం వ్యక్తం చేశాననీ, ఈ ఎన్నికల్లు భారత ప్రజాస్వామ్యాన్ని ఎంతో పటిష్టం చేసినప్పటికీ, ఆ పార్టీలో ఆత్మ పరిశోధన, పునరుజ్జీవనం ప్రారంభం కాకపోతే, శోచ నీయమైన పరిస్థితిగా భావించవలసి ఉంటుం దనీ శ్రీ నారాయణ అన్నారు.

''దీని అర్థం కాంగ్రెసేతర పక్షాల పరి స్థితి అంతా ప్రశంసనీయంగా ఉన్నదనికాదు. మొదటి విషయం ఎన్నో పార్టీలు ఉన్నాయి. వాటి మధ్య విభేదాలు కూడా ఎక్కువగా ఉన్నాయి. అత్యంత ఆశ్చర్యకరమైన ఫలితం సాధించిన మద్రాసు రాష్ట్రం ఇందుకు ఒక మినహాయింపు. ఈ సందర్భంలో ఒరిస్సా ద్వితీయ స్థానం ఆక్రమిస్తున్నది. ఎంతో ఇంగిత జ్ఞానం ప్రదర్శించిన ప్రజలు, మిశ్రమ మంత్రి వర్గాల ఏర్పాటుకే కాక, సమాన భావాలు కల పార్టీల మధ్య శాశ్వతమైన సమైక్యతను సాధించడానికి కృషి చేయగలరని ఆశిద్దాం. ముఖ్యంగా సోషలిస్టు పార్టీలు తత్వంబంధమైన వర్గాలు ఒక కూటమిగాను వ్యక్తి స్వాతంత్ర్యం, స్వేచ్ఛా వ్యాపారం కావా లనే వారు మరొక వర్గంగాను ఏర్పడగలరని నేను ఆశిస్తున్నాను.'' అని కూడా శ్రీ నారా యన్ విశదం చేశారు.

ఏది ఏమైనా, పెక్కు రాష్ట్రాలలో కాంగ్రెసేతర ప్రభుత్వాలు ఏర్పాటు చేసేం దుకు, ప్రతిపక్షాలు సన్నిహితం కావటం సంతోషదాయకమని ఆయన చెప్పారు.

ఇంతకాలం బాధ్యతలు లేకుండా పనిచేసిన ప్రతిపక్షాలు ఇప్పుడు వాస్తవిక పరిస్థితులను ఎదుర్కొని, ఫలితాలు సాధించవలసి ఉంటుం దన్నారు.

కేంద్ర—రాష్ట్ర ప్రభుత్వాల మధ్య ఇక ముందు ఉండే సంబంధాలను గూర్చి కొన్ని వర్గాల వారు వ్యక్తం చేసిన భయ సందేహా లను ప్రస్తావించి, భయపడవలసిన అవసరం ఉన్నట్లేమీ కనిపించటంలేదని శ్రీ నారా యణ్ అన్నారు. ఇంతకాలం, కేంద్రమునకు రాష్ట్రాలకు మధ్య సంబంధం, కాంగ్రెసు కేంద్ర సంస్థకు, దాని శాఖలకు మధ్య సంబంధంవలె ఉంటూ వచ్చిందనీ, ఫెడరల్ వ్యవస్థ పనిచేసే అవకాశమే లేకపోయిందనీ, ఇప్పుడు ప్రత్యక్షంగా అందుకు అవకాశం ఏర్పడిందనీ వివరించారు.

# విమానంలో టైమ్ బాంబు ?

మద్రాసు, మార్చి 13 : ఇక్కడ విమా నాశ్రయం నుంచి ఒక కార్వెయిర్ విమానం కల కత్తాకు బయలుదేరనున్న తరుణంలో, ఆ విమానంలో టైమ్ బాంబు ఉన్నట్లు ఎవరో గుర్తు తెలియని వ్యక్తులు ఇండియన్ ఎయిర్‌లైన్స్ సంస్థ అధికారులకు ఫోను చేయ డం వల్ల, ఆ విమాన ప్రయాణం ఆలస్య మయింది. విమానంలో ఎక్కిన 90 మంది ప్రయాణికులనుమదించివేశారు. ఈవిషయంపై పరిశోధన చేస్తున్నారు.

# ఆకాశవాణి

[ తెలుగులో వార్తలు : ఉ॥ 7; మ॥ 1-50 సా॥ 7 ;] ఇంగ్లీషు వార్తలు ఉ॥ 8: మ॥ 1.30: సా॥ 6: రా॥ 9.

### గురువారం, మార్చి 16

#### హైదరాబాద్ —ఎ

405.4 మీ

ఉ. 6.00 వందేమాతరం 6.10 భక్తి రంజని 6.45 సూక్తి ముక్తావళి 6.50 వాద్యగోష్ఠి 7.15 విజయవాడ వలె 7.45 సుగం సంగీత్ 8.30 విజయవాడ వలె

మ. 12.30 కార్మికుల కార్యక్రమం 1.00 స్త్రీలకు 1.40 చిత్రపదోస్ 2.00 లలిత సంగీతం 2.20 హస్సన్ మొహమద్

సా. 5.30 స్థానిక ప్రకటనలు 5.35 గ్రామలక్ష్మి 5.50 బాలవిహార్ 6.25 ముఖ్య ప్రకటనలు 6.30 వ్యవసాయిక విష యాలు 7.15 దీక్ష 7.30 చతురంగం 7.45 రాగం, తానం, పల్లవి 10.00 ఎమ్. ఎస్. గోల్‌వాల్‌కర్ 10.40 జన గణ మన.

#### హైదరాబాద్ —బి

కడప 333.3 మీ
విశాఖపట్నం 322.5 మీ
సా. 5.30 నుండి రా. 10.40 వరకు

ఉ. 6.00 ఎవలె 8.00 ఎవలె

మ. 12.30 ఎవలె 1.00 నేతి శ్రీరామ శర్మ 1.30 ఎ వలె 2.10 గానసుధ 2.20 ఎవలె

సా. 5.30 ఎవలె 7.15 ఎవలె 9.30 ఎ వలె 10.00 నేతి శ్రీరామ శర్మ 10.30 ఎవలె 10.40 జన గణ మన.

#### విజయవాడ

357.1 మీ

ఉ. 6.00 వందేమాతరం 6.10 భక్తి రంజని 6.45 సూక్తి ముక్తావళి 6.50 బజారు ధరలు 7.15 నాదస్వరం 8.30 వోలేటి వెంకటేశ్వర్లు.

మ. 12.30 కార్మికుల కార్యక్రమం 1.00 నాదస్వరం

సా. 5.30 స్థానిక ప్రకటనలు 5.35 గ్రామలక్ష్మి 6.15 వాద్య బృందం 6.25 ముఖ్య ప్రకటనలు 6.30 పంటసీమలు 7.15 దీక్ష 7.30 చతురంగం 7.45 రాగం, తానం, పల్లవి 8.40 చిత్రరంగిణి 10.00 వోలేటి వెంకటేశ్వర్లు 10.35 జన గణ మన.

#### మద్రాసు — ఎ

416.7 మీ

ఉ. 6.00 వందేమాతరం 6.40 బజారు ధరలు 6.45 సంగీతామృతం 7.35 రాగం, తానం, పల్లవి. 8.20 ఎ. ఎస్. అనంతగోపా లన్ 8.45 గీత మంజరి 10.30 మధుర గీతం

మ. 12.00 కార్మికుల కార్యక్రమం 12.30 ఎ. ఎస్. అనంతగోపాలన్ 1.30 వాద్య గోష్ఠి 1.45 చిత్రగానం

సా. 5.30 సంగీత మంజరి 5.45 రూపకం 6.05 ప్రాంతీయ సెంయిరిగల్ 6.15 చిత్రగానం 7.30 వ్యవసాయదారు లకు 9.15 పుస్తక సమీక్ష 9.30 గోటు వాద్యం 10.30 చిత్రగానం 11.55 జన గణ మన.

#### మద్రాసు —బి

211.3 మీ

ఉ. 6.00 ఎవలె 6.45 ఎవలె 7.45 [illegible] 7.30 ఎ వలె

మ. 11.55 ఎవలె 2.00 స్త్రీల కార్య క్రమం

సా. 6.05 ఎవలె 6.20 స్థానిక ప్రక టనలు 6.45 ఎ వలె 7.15 వాద్య సంగీతం 8.15 [illegible] 10.00 ఎవలె 10.35 జన గణ మన.

# భీమసింగి వద్ద చక్కెర ఫ్యాక్టరీ

## శ్రీ పి. ఎల్. ఎన్ రాజు శంకుస్థాపన

విజయనగరం, మార్చి 14 : విశాఖపట్నం జిల్లాలో ఇప్పుడున్న నాలుగు సహకార చక్కెర ఫ్యాక్టరీలుగాక మరొక సహకార చక్కెర ఫ్యాక్టరీ నెలకొనబోతున్నది. ఈ ఫ్యాక్టరీ యం త్రాలకు కట్టడాలకు, 223 లక్షల రూపా యలు ఖర్చుకాగలదని భావిస్తున్నారు.

ఫ్యాక్టరీ డైరెక్టర్ల బోర్డు అధ్యక్షుడు శ్రీ పి. లక్ష్మీ నరసింహరాజు నిన్న భీమసింగి వద్ద ఫ్యాక్టరీకి శంకుస్థాపనచేశారు.

ఫ్యాక్టరీ జనరల్ మేనేజర్ శ్రీ బి. సత్య నారాయణ విలేఖరులతో మాట్లాడుతూ ఆరంభంలో రోజుకు 1250 టన్నుల చెరకు ఆడగలదని, తర్వాత రోజుకు 2000 టన్నుల చెరకు ఆడుతుందని చెప్పారు. విజయ నగరం, భీమునిపట్నం, శృంగవరపుకోట చెరకు రైతులకు ఈ ఫ్యాక్టరీవల్ల ప్రయోజనం కలుగుతుంది. (స్వ.వి.)









# 'సంజీవరెడ్డిని మినహాయించడానికి బ్రహ్మానందరెడ్డి కారణం కాదు'

## పత్రికా వార్తలపై శ్రీ తిమ్మారెడ్డి ఖండన

(''ఆంధ్రపత్రిక'' ప్రతినిధి) హైదరాబాదు, మార్చి 14

శ్రీ నీలం సంజీవరెడ్డిగారిని కేంద్ర మంత్రివర్గం నుంచి మినహాయించడంలో శ్రీ బ్రహ్మానందరెడ్డిగారికి ఎలాంటి సంబంధమూ లేదని వ్యవసాయ మంత్రి శ్రీ పి. తిమ్మారెడ్డి ప్రకటిస్తూ ఈ విషయమై మద్రాసు నుంచి వెలువడే ఒక దినపత్రికలో ప్రచురితమైన వార్తను నిశితంగా ఖండించారు.

శ్రీ నీలం సంజీవరెడ్డిని కేంద్ర మంత్రి వర్గంనుంచి మినహాయించడంలో శ్రీ బ్రహ్మా నందరెడ్డి మాట చెల్లి ఉంటుందని ఆ దిన పత్రిక వ్రాసింది.

పార్లమెంటరీ కాంగ్రెసుపార్టీ నాయకు రాలిగా ఎన్నిక కావడానికి శ్రీమతి ఇందిరా గాంధికి అత్యధికమైన మెజారిటీ ఉందని, అయితే పోటీ నివారించడానికి ఏకగ్రీవ ఎన్నిక జరగడానికి కొందరు నాయకులు ఇచ్చిన సలహా పాటించబడిందని ఆయన చెప్పారు.

శ్రీ మొరార్జీదేశాయ్‌వంటి వ్యక్తిని మంత్రి వర్గములో చేర్చడంవల్ల ఎంతో బలం చేకూరి నదని ఆయన అన్నారు.

డాక్టర్ చెన్నారెడ్డిని క్యాబినెట్ మంత్రిగా చేయడంపట్ల ఢిల్లీలో ఇతర రాష్ట్రాలకు చెందినవారు, ప్రభుత్వ అధికార్లతోసహా అం దరూ హర్షం వెలిబుచ్చారని, శ్రీ చెన్నారెడ్డి అంటే ప్రతి ఒక్కరికి సదభిప్రాయం ఉన్న దని ఆయన చెప్పారు.

వారసుడు ఎన్నికయ్యేవరకు తాను ఏ.పి.సి.సి. అధ్యక్షుడుగా కూడా ఉండగలనని ఆయన తెలిపారు. అయితే ఏ.పి.సి.సి. అధ్యక్ష పదవికి రాజీనామా ఇచ్చి మరొక తగిన వ్యక్తి ఎన్నికకు అవకాశం కల్పించాలని కుంటున్నామన్నారు.

నామా ఫలితంగా శ్రీకాకుళం పార్లమెంటరీ సీటుకు జరిగే ఉప ఎన్నికలో మాజీ కేంద్ర మంత్రి శ్రీ దమోదరం సంజీవయ్యను నిల బెట్టవచ్చునని శ్రీకాకుళంనుంచి తనకు సూచ నలు వచ్చాయని చెప్పారు. ఈ ఉప ఎన్నికలో ఎవరు పోటీచేయాలన్న విషయాన్ని గురించి తాము ఇంకా ఆలోచించలేదన్నారు. నిర్ణయాన్ని తీసుకోవడానికిముందు ఆలోచించవలసిన విష యాలు చాలా ఉన్నాయన్నారు. చివరకు కాంగ్రెసు అధిష్ఠానవర్గం ఆమోదాన్నికూడా పొందవలసి ఉంటుందని ఆయన చెప్పారు.

శ్రీకాకుళం పార్లమెంటరీ నియోజకవర్గ ములో కాంగ్రెసు అభ్యర్థి ఓటమిపై వ్యాఖ్యా నిస్తూ ''మాకు మేమే'' ఎంతో హాని చేసు కున్నాం, లేకపోతే గెలిచి ఉండేవాళ్లం'' అని ఆయన సమాధానమిచ్చారు.

శాసనసభలో ఏదైనా అంశంపై నిబంధ నలను తయారుచేయుటంపట్ల మంత్రులు, సాధారణంగా ఎం.ఎల్.ఏ.లు అంత శ్రద్ధగా ఉండడంలేదని ఆయన అన్నారు. ఈ నిబంధ నలు ఎందుకు చెల్లవని ప్రశ్నించినప్పుడు మాత్రం వారు ఎదుర్కోలుకు లోనుకావలసి వస్తోందన్నారు. ఈ నిబంధనలను శాసనసభలో ప్రవేశపెట్టేముందు అధికారులు సరిగ్గా పరిశీలించడం లేదన్నారు.

గతంలో తాను ఎనిమిది జి. ఓ. లను కమ గొన్నామని, ఇవన్నీకూడా అధికారులకు రక్షణ కల్పించేవేనని ఆయన చెప్పారు. నిబంధనలను [illegible]

## శ్రీకాకుళం నుంచి శ్రీ సంజీవయ్య పోటీ ?

[illegible]

# రాష్ట్ర మంత్రివర్గం విస్తరణ

(1 వ పేజీ తరువాయి)

హాటికి కాంగ్రెస్ నిల బెడులోందని, ఇందు నిమిత్తం కేంద్ర ఎన్నికల సంఘానికి సిఫా ర్సులు చేయడానికి రాష్ట్ర కాంగ్రెస్ ఎన్ని కల సంఘం ఈ నెల 17వ తేదీన సమావేశ మవుతుందని ముఖ్యమంత్రి చెప్పారు.

కేంద్ర కాంగ్రెస్ పార్లమెంటరీ పక్ష నాయకత్వ ఎన్నిక ఏకగ్రీవంగా జరిగిందనీ, ఎన్నిక అయినాక శ్రీమతి ఇందిరాగాంధి ఆయా రాష్ట్రాల నుంచి తన మంత్రి మండలికి సభ్యులను తీసుకొనేముందు ఆయా రాష్ట్ర నాయకులను సంప్రతించడం సహజంగా జరిగేదనీ, అదే విధంగా ఇప్పుడు జరిగిందనీ మలో ప్రశ్నకు జవాబుగా ముఖ్యమంత్రిచెప్పారు

ఆంధ్ర నుంచి కేంద్ర మంత్రి మండలిలో ప్రాతినిధ్యం మీకు తృప్తి నిచ్చిందా ; అని అడగా, ''ఆంధ్రకు తగిన ప్రాతినిధ్యమే లభించిందని'' ఆయన సమాధానమిచ్చారు.

కాంగ్రెసేతర ప్రభుత్వాలు వచ్చిన చోట ధరలు తగ్గుతున్నాయి కద ; అని అడగా, ''వాటి సంగతి చూడవలసి ఉంటుంది'' అని అన్నారు.

ధరల తగ్గుదలకు గట్టి చర్యలు సత్వరం తీసుకోవలసి ఉంటుందన్నారు.

మిమ్మల్ని కేంద్ర మంత్రి వర్గంలో చేర మని ఆహ్వానించడం జరిగిందా ; అని ఒక విలేఖరి ప్రశ్నించగా, అలాంటి ప్రశ్నలు అడగ వద్దని ముఖ్యమంత్రి అన్నారు. ఒక వేళ ఎవ రైనా ఆహ్వానించినా, ఇవతలి పక్షం వారు వెళ్లడానికి సిద్ధంగా ఉండాలికదా అని కూడా ఆయన అన్నారు.

రాష్ట్రం నుంచి అదనంగా బియ్యం సర ఫరా చెయ్యమని శ్రీ పంబా(డిపాడ్) నుంచి మీకు లేఖ ఏమైనా వచ్చిందా అని అడగ్గా ఆ విషయం తామింత వరకు అడగలేదనీ, కాంగ్రె సేతర ప్రభుత్వాలు ఉన్న రాష్ట్రాలకు కూడా వీలయినంత వరకు సహాయపడటానికి ఆంధ్రప్రదేశ్ సహాయ సహకారాలు అంద చేస్తుందని ముఖ్యమంత్రి చెప్పారు.

## గంటల పంచాంగం

పరాభవనామ సం. ఫాల్గుణమాస బహుళ చవితి
1967వ సం. మార్చి 15 బుధవారం బుధ. చవితి సా 8.26, అశ్వి: ప. 9.5, వర్జ్యం: 6.21 వరకు. పా. 7.51 ము 9.38 వరకు.
1967 సం. మార్చి 16 గురువారం గురు. పంచమి: రా. 10–43, భరణి ప. 11–59 వర్జ్యం: రా. 1–16 ము. 2 వరకు,

ఆంధ్రపత్రిక

ఒరులేయవి యొనరించిన
నరవర యప్రియము తన మనంబునకగు దా
నొరులకు నవి సేయకునికి
పరాయణము పరమ ధర్మ పథములకెల్లన్
(మహాభారతము)

శ్రీ పరాభవనామ సం. ఫాల్గుణ బహుళ చవితి
బుధవారం

## కేంద్ర మంత్రివర్గం

కేంద్రంలో మంత్రి వర్గం ఏర్పడింది. ఈ మంత్రివర్గంలో కేబినెట్ మంత్రులు, సహాయ మంత్రులు కలసి మొత్తం 33 మంది దాకా మంత్రులు ఉన్నారు. త్వరలోనే కొంతమంది డిప్యూటీ మంత్రులను కూడా వేయవచ్చు. ఇట్లు ఈ మంత్రి వర్గం సంఖ్యచేత పూర్వపు కేంద్ర మంత్రివర్గాలకన్నా అధికమైంది. కాంగ్రెసుకు పార్లమెంటులో సంఖ్యాబలం తగ్గి ఇప్పుడు మంత్రి మండలిలో మంత్రుల సంఖ్య అధికం కావటం గమనించతగిన విశేషం.

ఇప్పుడు ఈ మంత్రిమండలి నిర్మాణంలో శ్రీమతిగాంధీ కొన్ని కొత్తమార్గాలననుసరించారు. ఒక మార్గం పార్టీని, మంత్రి మండలిని బలపరచడం కోసం అవసరమైంది. ఉపప్రధాని పదవిని తిరిగి పునరుద్ధరించడం ఇటువంటి వానిలో ఒకటి. రెండవది కొత్తవారిని మంత్రి మండలి లోనికి తీసుకోవడం. ఈ తీసుకోవడంలో ప్రధానమంత్రి పార్లమెంటులో ప్రస్తుతం సభ్యులుగా లేని కొందరిని తీసుకొన్నారు. వారిలో ఒకరికి ఇద్దరుకు తాము ఈవిధంగా కేంద్రంలో మంత్రులవబోతున్నట్లు ముందుగా తెలియదు వారిలో ప్రస్తుతం గురుతరకార్యభారాన్ని నిర్వహిస్తున్న వారుకూడా ఉన్నారు కాబట్టి ఇట్లా చేయడం ఒక కొత్త మార్గంగా ఉంది.

ఇప్పుడు మంత్రులుగా వేసుకొనబడిన కొందరు ఒట్టి సాంకేతికులు. రాజకీయాలతో అట్టే సంబంధంకలవారుకారు ఇది ఒక విధంగా మంచిదే అనుకొన్నా వారిలో నాయకత్వ లక్షణం ఎంతవరకు ఉన్నదీ అన్నది కూడా చూచుకోవలసి ఉంటుంది. ప్రధాని అట్లా చూచుకోకుండా వారిని మంత్రివర్గంలో చేర్చుకొన్నారని అనడం ఎట్లా? కాబట్టి ఇది కొత్త మార్గమే.

ఇప్పుడు కొత్తగా మంత్రి మండలిలోనికి వచ్చిన వారిలో కొందరు దేశం అంతకూ తెలిసిన వాళ్లుకాదు కొత్తగా మంత్రులైనారు పూర్వంనుంచి మంత్రులుగాఉండి, దేశం ఎరుగుపడిన వారిసంగతి అందరికీ తెలిసిందే. కొత్తవారు ఇప్పుడు మంత్రులుగా తమ సమర్థతను ఋజువు చేసుకోవలసిఉంది.

ఒకవిధంగా ఇప్పుడు ఏర్పడిన ప్రభుత్వం ప్రజల ... ఎవి, తమ కార్యకారత్వాన్ని నిరూపణ [illegible] దేశంలో కాంగ్రెసును కాంగ్రెసుపార్టీ ప్రభుత్వాన్ని గురించి బహువిధమైన విమర్శలు ఉన్నాయి ఈ విమర్శలు అన్నీ న్యాయమైనవి కాకపోవచ్చు. కాని మొత్తం విమర్శను కొట్టిపారవేయ లేము ఆ విషయం కాంగ్రెసు వారికీ. కాంగ్రెసు నాయకులకు తెలుసు అందుచేతనే ఇప్పుడు ఏర్పడిన ఈ కేంద్ర మండలి పూర్వం కాంగ్రెసు ప్రభుత్వాలు చేసిన తప్పులను సరిదిద్దుకుంటూ, ఇక ముందు దేశంయొక్క ప్రజల యొక్క మెరుగుకోసమైన విధానాలను ఆచరణ యోగ్యమైన విధానాలను నిర్ణయించుకొని అనుసరించవలసి ఉంటుంది అనగా ఇప్పుడు ఇంత వరకు అనుసరిస్తూవచ్చిన విధానాలను చాలావరకు మార్చుకోవలసి ఉంటుంది

ఇట్లా ముఖ్యంగా మారవలసిన విధానాలలో ప్రణాళికలకు సంబంధించిన విదేశాంగ నీతికి సంబంధించిన విధానాలు కూడా ఉన్నాయి దేశంయొక్క ఆంతరంగిక విధానాలకు చిహ్నం ప్రణాళిక. ప్రణాళికా పద్ధతిని సాధించబడిన అభివృద్ధి అస్తవ్యస్తంగాఉంది. అదే పద్ధతిని ఇంకా కొనసాగించడంవలన ఇప్పుడు లాభం ఏమన్నా ఉన్నదేమో ఆలోచించుకోవలసిఉంది ఇప్పుడు కేంద్రంలో కూడా కొందరు వార్షిక ప్రణాళికల పద్ధతిని గురించి ఆలోచిస్తున్నారు. అనగా పంచవర్ష ప్రణాళికా పద్ధతి ఇప్పుడు అనేక కారణాల వలన ఆచరణ సాధ్యంగా కనిపించడంలేదని అర్థం. ఒక విధంగా చూస్తే కొందరు నిపుణులు సూచిస్తూ వచ్చినట్లు తాత్కాలికంగానైనా ఈ ప్రణాళికల ఆలోచనలను ఆపుకొనడం ఉచితంగా ఉంటుంది

ప్రభుత్వం తన ప్రయోజనాన్ని నిరూపించాలి అంటే, ప్రజల అవసరాలేమిటో గుర్తెరిగి, వానిని తీర్చడానికి ప్రధాన ప్రయత్నం చేయవలసి ఉంటుంది. ఈవిషయాన్ని కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ కామరాజు కూడా గుర్తించారు మరి ప్రజల అవసరాలు అంటే ఏమిటి? తక్కిన వాటిసంగతి ఎట్లా ఉన్నా వారికి 'గ్రాసవాసోదైన్యాలు' ఏర్పడకుండా చూడాలి. ఇంతవరకు ఈ దైన్యం తొలగలేదు అంటే అందుకు కారణంఏమిటో పర్యాలోచనచేసుకొనకపోతే. ముందు పనులు జరగడమే కష్టం.

సోషలిజం యొక్క పేరుమీద ప్రణాళికలు వెయ్యడమే గాని, అందులో ఏది ప్రధానమో ఏది అప్రధానమో, ఏది ఆచరణ సాధ్యమో నిర్ణయించడంలో దేశానికి జరగవలసిన నష్టం అంతా జరిగిపోతున్నది. ఏయేడీ కాయేడు కోట్లకు కోట్లు రూపాయలుపోసి ఆహారధాన్యాలను ఖరీదు చేయవలసి వస్తున్నది. రష్యావంటి దేశాలలో మొదట ప్రణాళికలు వేసుకున్నప్పుడు పరిశ్రమలకు అధిక ప్రాధాన్యంఇచ్చివ్యవసాయాన్ని రెండవ చూపు చూడడంలో ఆ తొలిరోజుల్లో కొంత అర్థం ఉంది. ఆ దేశంజనాభా అరోజుల్లో తక్కువ. వారికి కావలసిన ఆహార పదార్థాలు కూడా అదే దామాషాలో అవసరం. మన దేశం సంగతి అట్లాకాదు. ఇదప్పట ముందు వ్యవసాయ రంగాన్ని చక్కబెట్టుకొని అధికోత్పత్తిని సాధించినప్పుడే తక్కిన ఆర్థిక వ్యవస్థ అంతా బలపడుతుంది. ఈ విషయాన్ని ఇంతవరకు అధికారంలో ఉన్న వారు గ్రహించక పోగా. ఎవరైనా తెలిసిన ఇతర దేశాలవారు అమాట చెబితే, అది ఆంతరంగిక వ్యవహారంలో జోక్యంగా అభివర్ణించబడటం జరుగుతున్నది.

దేశంలో అంతరంగిక విధానాలనుబట్టి విదేశాంగ విధానం నిర్ణయం కావలసి ఉంటుంది అంతేగాని విదేశాంగ విధానాన్ని నిర్ణయించుకొని దాని ప్రకారం ఆంతరంగ విధానాలను నిర్ణయించకూడదు. అది తలక్రిందులు విధానం అంతర్జాతీయ రంగంలో మన ప్రతిష్ఠ తలక్రిందులు కావడానికి ఏర్పడ్డ కారణాలలో ఇది ఒకటి అని చెప్పడం తప్పుకాదు.

ఇప్పుడు కేంద్ర మంత్రివర్గం వారు ఈ అన్ని విధానాలను ఆలోచించుకోవలసి ఉంటుంది. అసలు మంత్రివర్గం ఈ ఆలోచన దృష్టితో ఏర్పడితే పనులన్నీ ఏ రకమైన విప్రతిపత్తిగాని లేకుండా జరిగిపోగల అవకాశం ఉంటుంది. అంతేగాక, మంత్రి పదవులు ఉన్నప్పుడేగాక, ఆ పదవులు లేని సందర్భంలో కూడా కార్యజ్ఞులుగా, దేశం మన్ననను పొందగలవారుగా ఉండే సమర్థులకే మంత్రిమండలిలో స్థానం ఉండటం అన్న సూత్రాన్ని గూడా పాటించడం అన్ని విధాలా యోగ్యమైన విషయం ఇప్పుడు ఈ తమ మంత్రివర్గ నిర్మాణంలో ఈ రకమైన అన్ని ప్రయోజనాలను దృష్టిలో పెట్టుకొని ప్రధానమంత్రి పని చేసింది లేనిదీ కాలంమీద కాని తేలదు.

# నాలుగవ జనరల్ ఎన్నికలు
# కొన్ని స్పష్టమైన పోకడలు

భారతదేశం స్వాతంత్ర్యం సాధించిన తర్వాత జరిగిన నాలుగవ జనరల్ ఎన్నికలు చాలా విస్మయమైన ఫలితాలను వెల్లడించినట్లు దేశ, విదేశ రాజకీయ పండితులు వ్యాఖ్యానిస్తున్నారు. ప్రతిపక్షాలకు సహితం ఈ ఫలితాలు ఊహాతీతమనే చెప్పుటకు వారి వాయకుల అభిప్రాయాలు విదితం చేస్తున్నాయి. స్వాతంత్ర్యం తర్వాత వరుసగా మూడుసార్లు ఎన్నికలలో నెగ్గి, జాతీయమైన దేశవ్యాపిత ప్రజాస్వామ్యం శక్తిగా ఋజువు చేసుకున్న కాంగ్రెసుపార్టీ అగ్రనాయకులంత ఈ ఫలితాలు తారుమారు చేసినట్లు ఉన్నాయి. వారికి వారు ఈ పరిణామంపైన సమీక్షించి— దీనికి మూల కారణం ఏమయి ఉంటుందో వెదకట్టము ప్రయత్నిస్తున్నట్లున్నారు.

"భారతదేశంలో ప్రజాస్వామ్యం ఇంకెంతో కాలం నిలబడలేదు. చిన్నాభిన్నమైన విష్లర పార్టీలు రాష్ట్రాలలో తలయెత్తి కేంద్రం బలహీనమయి పోయినప్పుడు మిగిలేదేమిటి?"

"దేశంలో మితవాద అభివృద్ధి నిరోధక తత్వం విజృంభిస్తూంది."

"ఎన్నికల అపజయాన్నుండి బయట పడను కాంగ్రెసు అభివృద్ధినిరోధకులతో కలసి దివాలాకోరు రాజకీయ సంస్థాకు దిగజారింది. ప్రజలు వోటులతోకాకుండా తిరుగుబాటుతో సమాధానమిస్తారు?"

"కాంగ్రెసుప్రభుత్వం ప్రజా వ్యతిరేక పంధాలే ఈ ఫలితాలకు కారణం".

"కాంగ్రెసుపార్టీ ప్రజలపార్టీగా పనిచేయటంలో విఫలమైంది కాబట్టే ఈ ఫలితాలు కలిగాయి" అని దేశంలో వినిపిస్తే "నెహ్రూ నిర్యాణం తర్వాత కాంగ్రెసులో అంతర్గతంగా గామా—బల్యూ: అభివృద్ధి నిరోధక శక్తులు విజృంభించి దేశాన్ని వెనక్కు లాగాలని ప్రయత్నిస్తున్నారని మాకు ముందే తెలుసు. ఈ ఎన్నికలు అదే వెల్లడి చేస్తున్నాయి." ఇందిరాగాంధి ప్రధానమంత్రిత్వం, కామరాజ పార్టీ నాయకత్వం విఫలమైపోయిందని ఈ ఎన్నికలు ఋజువుచేస్తున్నాయి. నాయకత్వం శక్తిహీనంతమైన వారి చేతులలో ఉంటే తప్ప కాంగ్రెసు ఇక లాభంలేదని తేలిపోయింది"

పైన కనపరచిన అభిప్రాయాలు దేశ విదేశాలలో వినిపించినవి. కాని నేటి ఈ ఎన్నికల ఫలితములు ఇట్లా ఉండవచ్చునని అంచనా వెయ్యలేకపోవడం, ఫలితాల తర్వాత కారణాలకు తపుడు కొమలలోనే ఒకవిధంగా నాయకత్వ బలహీనత బయటపడుతుంది. వయోజన వోటింగు, బహిరంగ పక్షపు ప్రజాస్వామ్యం అమలులోకివచ్చి ఇరువదేండ్లయింది. వరుసగ 1952 నుండి దేశంలో జరిగిన మూడు ఎన్నికలు ఇరవేకాలంలో తలఎత్తిన రాజకీయ సాంఘిక, ఆర్థికఉద్యమాలూ— వోటర్లపై వాటి ప్రభావం, 1957 తర్వాత దాదాపు కోటిమంది కొత్త వోటర్లు రంగంపైకి వచ్చారు. వీరికి స్వాతంత్ర్యపోరాటం అనుభవంలేదు. విజావికి ఇక ఒకటి రెండు ఎన్నికలను, స్వాతంత్ర్య పోరాటంలో పిల్లలున్న మనిషే భారతదేశంలో కనుసించము. స్వాతంత్ర్యం తర్వాత జరుగుతున్న సాంఘిక, ఆర్థిక, రాజకీయ పరిణామ ప్రభావంలో పడిపోయిన ప్రజలు మిగులుతారు. ప్రణాళిక వ్యవస్థ వాటి క్రమంలో ఏర్పడిన

జి. సి. కొండయ్య

అనేక చిక్కులు, సమస్యలు—అవి దేశంపై ప్రసరించిన ప్రభావాలు అంచనావేసినారా? నిజానికి వరుసగా పడచిన ఎన్నికల ఫలితాలు చేసిన హెచ్చరికలు గమనించినట్లు లేదు. 1952 నుండి కాంగ్రెసు బలం క్రమేపీ క్షీణిస్తూ వచ్చింది. 1952 కన్నా 1957లో కొంత తగింది. 1957లో దేశం మొత్తంమీద కాంగ్రెసుకు 1893 స్థానాలు అసెంబ్లీలో ఉంటే, 1962లో 1759 స్థానాలకు దిగజారింది. 1967లో అంటే నేటి ఎన్నికలలో 1608కి పడిపోయింది. కాశ్మీరు, జమ్మూను తొలగించి చూస్తే భారతదేశంలో 3262 అసెంబ్లీ స్థానాలుంటే కాంగ్రెసుకు 1545 మాత్రమే వచ్చాయంటే, సగానికి తక్కువ వచ్చాయనేది స్పష్టం. దీని ఫలితం ఎనిమిది రాష్ట్రాలలో ప్రభుత్వాన్ని ఏర్పరచగలిగిన సంఖ్యాబలం రాలేదు. పార్లమెంటులో ప్రభుత్వాన్ని చేపట్టగలిగిన సంఖ్య కాంగ్రెసు చేపట్టగలిగినా, అది చాలీచాలని బలమని వేరే చెప్పనక్కర్లేదు. ప్రజాస్వామ్య వ్యవస్థలో ఒకే పార్టీగా శాశ్వతంగా అధికారంలో ఉండినప్పుడు ఎన్నికలద్వారా దానిని రద్దు చేయవలసి వచ్చినప్పుడు: అంతకన్నా మెరుగయిన ప్రజాస్వామ్య పార్టీ ఒకటి ప్రత్యామ్నాయ పార్టీగా ఉండడం ఎంతయినా అవసరము. భారత ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధి "భారతదేశంలో ప్రజాస్వామ్య వ్యవస్థ ఎంత స్థిరపడిపోయిందో ఎన్నికలు ఎంత నిష్పక్షపాతంగామా, స్వేచ్ఛగామా జరుగుతుందో ప్రతిపక్షాల ఎన్నిక ఋజువు చేస్తుంది" అని చెప్పడం, కొన్ని అంతర్జాతీయ విమర్శలు "ప్రతిపక్షాలు గెలవటమే భారతదేశంలో స్థిరమైన ప్రజాస్వామ్యం నాటుకపోయింది అని చెప్పవచ్చు"నని విధంగా వ్యాఖ్యానించడం అతి పేలవంగా కనుపిస్తుంది. ఏదో ఒక పార్టీ ఓడిపోవడం గెలవడమే ప్రజాస్వామ్యానికి పునాదికావేరదు. నిష్పక్షపాతముగా, స్వేచ్ఛగా, రహస్యంగా ఎన్నికల క్రమంలో ప్రజాస్వామ్య విధాన, పునాదులే కదలిపోకుండా చూసుకోవడం అంతే అవసరము అవుతుంది.

నేటి ఎన్నికలలో కనుపించిన పోకడలు, వెల్లడించే వాస్తవం ఏమిటి? భారతదేశంలో పని చేస్తున్న పార్టీలలో దేశవ్యాపిత పునాదులు కలిగియున్న పార్టీలు కాంగ్రెసు, కమ్యూనిస్టు, సోషలిస్టు, జనసంఘ, స్వతంత్ర పార్టీలు. మిగిలినవి స్థానిక, ప్రాంతీయ పార్టీలు. కమ్యూనిస్టు పార్టీ రెండయినా అవి ప్రజాస్వామ్య పార్టీలు కావు. సోషలిస్టులు, ఎస్.ఎస్.పి. కొన్ని ప్రాంతాలకు పరిమితమయిపోయినాయి. స్వతంత్ర పార్టీ ఆర్థికవిధానాలు వెనుకచూపే అయినా, రాజ్యాంగ వ్యవస్థకు సంబంధించినంతవరకూ ప్రజాస్వామ్యంలో విశ్వాసం ఉన్న పార్టీ, జనసంఘం. ఉత్తరభారతదేశంలో మంచి పునాదులు వేసుకుంటున్నా, ఆర్థిక విధానాల విషయంలో స్పష్టమైన పంథాలు లేకపోవడం, కొంత వెనుకచూపు విధానాలు, కొన్ని దేశీయ అంతర్జాతీయ విషయాలలో చిక్కులకు దారితీసే విధానములు వల్లించుకున్నా, ప్రజాస్వామ్య వ్యవస్థలో నమ్మకం ఉన్న పార్టీ, సోషలిస్టు ఉద్యమంలో చీలిపోయిన ఎస్.ఎస్.పి. ఒకవైపు ప్రజాస్వామ్యంలో విశ్వాసం ప్రకటిస్తూనే, రెండవ వైపు చాలా అరాచక పద్ధతులు అనుసరిస్తోంది. ఎస్.ఎస్.పి. కమ్యూనిస్టులో చేరిపోతూంది. ఈ పార్టీల బలాబలాలు, విధానాలు పరిశీలించి నప్పుడు, వస్తుతావికి ఈ పార్టీలలో ఏ ఒక పార్టీకి దేశవ్యాపిత పునాదులు, బలం కలిగి కాంగ్రెసుకు ప్రత్యామ్నాయ పార్టీగా కాగలిగిన తాహతు లేదు.

ఇది ఇలావుండగా రాష్ట్రాలలో కొన్ని ప్రాంతాలలో కొన్నిస్థానిక పార్టీలు, కాంగ్రెసు నుండి విడబడిపోయి, తాత్కాలికంగా ఏర్పడిన బృందాలూ ప్రజలపై మాంచి పట్టు కలిగి యున్నాయి. చైనా—పాకిస్థాన్ యుద్ధాలు, నెహ్రూ, శాస్త్రుల నిర్యాణం ఇవి లేవనెత్తిన అనూహిత వ్యయం. ప్రణాళిక క్రమంలో పని తాలూ లాక, భారం దేశంపై పడడం, డీవాల్యుయేషన్, జనాభా వత్తిడికి తగిన ఉత్పత్తి లేక ప్రధానంగా ఆహారధాన్యాలు కొరత వీటి ఫలితంగా ప్రభుత్వ ఉద్యోగులు, కార్మికులు, జీతాల పెంపకంకొరకు లేవనెత్తిన ఆందోళనలు నిర్వైరా దృశ్యమే ఎన్నికలముందు దేశదృశ్యము. ఎన్నికలను దృష్టిలో పెట్టుకోనివ్వండి, లేక ప్రతిపక్షాలుగా ఉన్నాయి కావున ప్రజా అసంతృప్తిని వినియోగించుకొనకటప్పుడు. కావున ఏ విధంగానయినా కనివ్వండి గత ఒకటిన్నర సంవత్సరంనుండి దేశంలో [illegible] బంద్‌లు, హర్తాళులు జరిగాయి. ప్రభుత్వ ఉద్యోగుల సుదీర్ఘ సమ్మెలు సాగాయి. హిందీ వ్యతిరేక ఉద్యమం మద్రాసు రాష్ట్రంలోనూ, గోసంరక్షణ ఉద్యమం ఢిల్లీ ఉత్తర భారతదేశం లోనూ, దేశమంతా ఏదోఒక సమస్యపై విద్యార్థి ఆందోళనలకు ప్రతిపక్షాలు నాయకత్వం వహించాయి. కొన్ని ప్రాంతాలలో ఈ ఆందోళనలు తీవ్రమైన వీధి పోరాటాల స్థాయికి దిగాయి. అనూహిత హింసా చర్యలు విలయతాండవం చేశాయి. సమాజంలో ప్రముఖమైన కీలకమైన ఒక భాగం ప్రజలు ఇంత తీవ్రమైన అసంతృప్తి, ఆందోళనలో ఉన్నప్పుడు కాంగ్రెసుపార్టీ, పార్టీగా ఏమిచేసినట్లు? ఇటువంటి సమస్యలున్నాయని, వీటిపైన ప్రజలలో అసంతృప్తిని విస్తృతమవుతూ ఉందని, ఈ అసంతృప్తిని ప్రతిపక్షాలు వినియోగించుకుని కాంగ్రెసుకు వ్యతిరేకంగా మరలించను ప్రయత్నిస్తున్నారని కాంగ్రెసుపార్టీ గ్రహించలేకపోవడం రాజకీయ దురదృష్టం వివిధ సమస్యలపై వీధులకు ఉరికిన ప్రజలను పోలీసులు అదుపులో పెట్టడం మినహా ఆ సమస్యల స్వరూపం, పరిణామం, వాటకు కారణాలను ప్రజలు అర్థం చేసుకొనేటట్లు చెయ్యను కాంగ్రెస్సు ఒక పార్టీగా ప్రజల ముందుకు వెళ్లలేదు. ఫలితంగా ఆందోళనలు జయించాయి అవి ప్రతిపక్షాల ప్రయత్నాలవలన, నిజానికి చాలా వరకు అసంతృప్తి కాంగ్రెసు వ్యతిరేకమవుతుంది. ఆ విధంగా ఈ పరిణామం రెండువైపులనుండీ ప్రతిపక్షాలకే లాభమయింది.

వయోజన వోటింగ్, బహుళపక్ష ప్రవేశం ఉన్న ప్రజాస్వామ్య ఎన్నికలో ఏర్పడే ప్రభుత్వ వ్యవస్థలో వోటర్లు ప్రాథమిక శక్తి అవుతారు. నేటి సమాజిక వ్యవస్థ, ముఖ్యంగా స్వాతంత్ర్యంతర్వాత ప్రణాళికాబద్ధమైన పరిణామములో పారిశ్రామిక విస్తరణ, దని క్రమంలో పెరుగుతున్న ఫ్యాక్టరీ పనివారు, విద్యుతను ఉన్న యువలోకం, ఆర్థికంగా కొంత మెరుగై అధికారం కొరకు తాపత్రయపడుతూన్న మధ్య తరగతి ప్రజలు, ఆధునిక వసతులకు ఆరాటపడుతూన్న వ్యవసాయ వర్గాలు, ధర పెరుగుడుతో, తికమకపడుతూన్న ప్రభుత్వపు ఉద్యోగులు, పబ్లిక్, ప్రైవేట్ వ్యవస్థలమధ్య కొట్టుమిట్టాడుటలో ఇబ్బందికి గురయిన వ్యాపార వర్గాలు, పాత పద్ధతి అదృశ్యంకాక కొత్త పునాదులు ఏర్పడక అయోమయ పరిస్థితిలో పడిన యువతరానికి ఏమిటి ఆదర్శం, ఏమిటి విశ్వాసం? భారతదేశం నేడు ఎదుర్కొంటున్న సంక్షోభమేమిటి? దీనికి మూల కారణాలు, పరిష్కారమునకు ఇంతవరకు జరిగిన ప్రయత్నాలు, ఫలితాలు ప్రజల ముందు ఉంచి, ప్రజల దైనందిన జీవిత క్రమంలో భాగస్వామిగా కాంగ్రెసుపార్టీ పనిచేసి ఉంటే సమాజంలో వివిధ వర్గాల ప్రజలలో వివిధ ఆర్గనైజేషన్ సంబంధాలు కలిగివుంటే, ముఖ్యముగా యువకులు, విద్యార్థులు, కార్మికులలో నిత్య సంబంధం ఉండి ఉంటే, నేటి పరిస్థితిని ప్రజలు సహేతుకంగా అర్థం చేసుకుని ఉండేవారు. ప్రతిపక్షాల నినాదాలు, ప్రయత్నాలలంతరార్థం సులభంగానే గ్రహించి ఉండేవారు సమాజంలో ఒక ప్రముఖ భాగమైన ఈ విషయాలు అర్థం చేసుకుని కాంగ్రెసువైపు నిలబడి ఉండేవారు. దీనికి మారుగా జరిగిందేమిటి? కాంగ్రెసుకు గణనీయంగా వోట్లు వచ్చినా, కాంగ్రెసుకు ఎన్నికలలో పనిచేసే వారున్నా వారి మనస్తత్వ మేమిటి? కార్యకర్తలు డిఫెన్స్‌లో పడిపోవడం, వోటువేసే వారు రాజకీయంగాకాక, స్థానిక పరిస్థితుల వత్తిడికి వేస్తున్నట్లు భావించడంగా కనుపిస్తుంది. మనోక్షంగా ఈ చిత్రణ అతిశయోక్తి కాబోదు. ఈ పరిణామమునకు కారణమేమిటి? కాంగ్రెసుపార్టీ ప్రజలతో నిత్య సంబంధం ఉన్న పార్టీగాలేదు. ఆర్గనైజేషన్ ఎన్నికలు వచ్చే సంవత్సరం జనరల్ ఎన్నికలకు ముందు టిక్కెట్ ప్రయత్నం కొరకు సభ్యత్వం చేర్పించడం. అదయినా ప్రజా సభ్యత్వంకాదు. పోటాపోటీలుగా పార్టీని పట్టుకొనుటకు అంతర్గతంగా పనిచేస్తున్న ముఠాలు సొంత డబ్బుతో పేర్లు వ్రాసి వెయ్యటం అదే సభ్యత్వంగా పరిగణించడం, ఈపరిస్థితులలో క్రిందిమండి పైకి చాలా భాగం, సిద్ధాంతాలు, విశ్వాసాలూ, కార్యక్రమం, ప్రజా అభిప్రాయానికి ఏమాత్రం సంబంధంలేని అరాజకీయ శక్తులు ఆర్గనైజేషన్‌ను స్వాధీనం చేసుకొనడం, ఈ క్రమంలో ఇది ప్రజలకొరకు పనిచేసే ప్రజా సాధనంగాకాకుండా, అధికార పెనుగులాటకు ఆటవస్తువుగా రూపొంది ప్రజలనుండి దూరమైపోవడం జరిగింది ఇలా పరిణమించిన పరిస్థితులలో టిక్కెట్టు పొందే అభ్యర్థులు చాలావరకు ఎట్లా ఉంటారో, వారి బలాబలాలు ఏమిటో ఊహించటం కష్టంకాదు. ప్రజల నిత్య సమస్యలపై సమీకరణ, ప్రమస్యలపై వివరణ, ఎడ్యుకేషన్ అనే ప్రశ్న అదృశ్యమై, అప్పుడప్పుడూ నాయకులు వచ్చినప్పుడు పూలదండలు, ఉపన్యాసాలూ జరపడం, అవయినా రాజకీయ పరిస్థితులపైనకాకుండా వ్యక్తుల గొప్పలమ్ముతికరణగా తయారయిపోవడంగా తల ఎత్తింది. ఈ పరిణామంలో ప్రజాస్వామ్య విలువలు, విశ్వాసాలూ నిలబడడం దుర్లభం. అధికారం, దాని ప్రయోజనం మాత్రమే పార్టీలో కేంద్రీకృతమైంది. ఇట్టి ఆదర్శాలకు నేటి సమాజంలో గురి అయిన పార్టీ ముఠాల, మురాగే శక్తులు ఏ స్థాయిలో గ్రహించడం సులభమే. ఇలా పడచిన పరిణామంలో కాంగ్రెసుకు మిగిలిన నినాదం ఒక్కటే "ప్రభుత్వానికి లాగిగిన శక్తి మాకే ఉంది రావు వోటు మాకేయ్యండి" ఈ నినాదం పనిచేయ లేదు. నేటి అవాంఛనీయ పరిస్థితికి కారణం కాంగ్రెసుపై సమస్యలకన్న గురి అయిన ప్రజలు, నేటి ప్రభుత్వం పాల [illegible] దేశ అంతటా [illegible] పక్షాలు పరిస్థితిని చక్కగా వినియోగించుకున్నాయి. కాని నేటి కాంగ్రెసు పతనంవల్ల ప్రజలు ఆశలు నెరవేరగలవా? దీనివల్ల కలిగే ప్రయోజనమేమిటి? అనే విషయాలు పరిశీలిస్తే, భారతదేశం ఒక అయోమయమైన, ప్రమాదకరమైన భవిష్యత్తువైపుకు పయనిస్తుందనే అనుమానం ఎవరికైనా కలుగుతుంది.

కాంగ్రెసుకన్నా మెరుగైన ప్రజాస్వామ్య పార్టీ దేశీయ, విదేశీయ, ఆర్థిక కార్యక్రమం కలిగిన పార్టీ, దాని స్థానంలో దేశవ్యాపితంగా అధికారమునకు రాగలిగినది ప్రస్తుతానికి సరోకటి లేదనేది వివాదరహితమైన విషయం. కాని నేడు జరిగినదేమిటి? మద్రాసులో డి.ఎం.కె., కేరళలో అతివాద కమ్యూనిస్టు, బెంగాలులో అతివాద కమ్యూనిస్టు కలగాపులగం, ఒరిస్సాలో స్వతంత్ర జనతాకాంగ్రెస్, ఢిల్లీలో జనసంఘం, బీహార్, ఉత్తరప్రదేశ్, రాజస్థాన్, పంజాబులలో ఇండిపెండెంట్ల సహాయంతో కాంగ్రెసు ప్రభుత్వాలు, ఈ క్రమంలో కేంద్రంలో కాంగ్రెసుకు అతి తక్కువ సంఖ్యాబలం. ఇది నేటి రాజకీయ చిత్రణ, కమ్యూనిస్టులలో కలిస్తే తప్ప ప్రభుత్వమునకురాలేనిరాష్ట్రాలలోవారిలో కలసి మిశ్రమ ప్రభుత్వాలు ఏర్పడుతున్నాయి. రాజకీయపాలసీలలోగాని ఆదర్శాలలోకమ్యూనిస్టు పార్టీ కిషటరపరిపకాలకు అవినాభావ సంబంధం లేదనేది స్పష్టం. కావున ఏ సమస్యపై పరీక్ష వచ్చినా, ఈ ప్రభుత్వాలు పడిపోక తప్పదు. అంటే ఈ రాష్ట్రాలలో తిరిగి ఎన్నికలు తప్పవు. అల్లాకాక మద్రాసు, కేరళ, వగైరా ఏకపక్ష బలం ఉన్న రాష్ట్రాలలో అధికారములో ఉన్న పార్టీలకూ, కేంద్రంలో అధికారంలో ఉన్న పార్టీకి పరిపాలన సమయంలో సంఘర్షణ అనివార్యమవుతుంది. ఈ విధంగా భారతదేశ రాజకీయ, రాజ్యాంగ వ్యవస్థ చాలా తీవ్రమైన సంక్షోభంలో పడనుంది. దేశములో నేడు జరిగిన ఎన్నికలలో ప్రతిపక్షాల విజయం స్పష్టమైన పాలసీలపై లభించిందేమీకాదు. ఇది నెగెటివ్ వోటు. కాంగ్రెసుపై నున్న ఏవగింపే ప్రతిపక్షాలకు వోటు. ఇలా దొరకిన ఈ బలాన్ని నిలబెట్టుకొనుటకు ఈ పార్టీలకున్న రాజకీయ పాలసీలు ఏమిటి? పాలసీలవైపు ప్రజల సమీకరించను వీటి కున్న ఆర్గనైజేషన్ శక్తి ఏమిటి? అనేది పరీక్షించినప్పుడు, జనకాంగ్రెసు, స్వతంత్ర, డి.ఎం.కె. కాంగ్రెసులోని ముఠాలు, తదితర స్థానిక ప్రాంతీయ పార్టీలు చాలాకాలం నిలబడలేకపోవచ్చు. స్పష్టమైన విధానాలు, తగిన ఆర్గనైజేషన్, ఆవేశపూరిత అనుసరణ చేయగలిగిన పార్టీ కమ్యూనిస్టుపార్టీ మాత్రమే. ఇటువంటి, ఈ పార్టీలకు కాంగ్రెసుపైనున్న ఏవగింపుకలిగి నెగెటివ్‌గా వోటుచేసిన ప్రజలకు ఆశాభంగం తప్పదు. అప్పుడే ప్రజలు తిరిగి ఎవరివైపు మరలుతారు? ఈ ఖాళీని ఎవరు నింపుతారు? అనేది నేటి ప్రశ్న. పరిస్థితులన్నీ సమీక్షించినప్పుడు కాంగ్రెసు నేటి దుస్థితినుండి బయటపడి పునర్నిర్మాణం చేసుకొని ప్రజాసాధనంగారూపొందడం ఏమాత్రం ఈ ఖాళీలో ప్రవేశించడం కష్టం కావచ్చు. అప్పుడిక నేటికన్నా అధ్వాన్న పరిస్థితికి భారత రాజకీయ దృశ్యం దారితీసి, రాష్ట్రాల మధ్య, కేంద్రంమధ్యా నిత్య సంఘర్షణ, అస్థిర ప్రభుత్వాలు, మిడ్‌టరమ్ ఎలక్షన్లు వగైరాలలో పరిస్థితులు కల్లోలమయి ప్రజాస్వామ్య వ్యవస్థకే ప్రమాదం సంభవించి ఏదో రకమైన నియంతృత్వానికి దారితీయవచ్చు. నేటి ఎన్నికలు, దాని ఫలితాలు వెల్లడించే రహస్యం ఇల్లా పరిణమించకుండా ఉండాలంటే, దని ప్రాథమిక, ప్రధాన బాధ్యత ప్రజాస్వామ్యపార్టీ అయిన కాంగ్రెసుపైన ఆధారపడి ఉన్నదని కాంగ్రెసుఒక్కటే ఈ పరిస్థితినుండి దేశాన్ని బయట వెయ్యటమో, లేక ...?

## ఉ థాంట్
## ఆసియా పర్యటన

సమితి (న్యూయార్క్), మార్చి 13: ఏప్రిల్ 4వ తేదీవాటు ఆయిదు ఆసియా దేశాలలో పర్యటించే నిమిత్తం సమితి ప్రధాన కార్యదర్శి శ్రీ థాంట్ పయనమవుతున్నారు.

ఆయన భారత, పాకిస్థాన్, శ్రీలంక, ఆఫ్ఘనిస్థాన్, నేపాల్‌దేశాల ప్రభుత్వాలలో సమాలోచనలు సంప్రదింపులు జరుపుతారు.

ఏప్రిల్ 8 నుంచి 10 దాకా శ్రీ థాంట్ కొలంబోలో ఉంటారు. న్యూఢిల్లీలో ఏప్రిల్ 13 దాకా ఉంటారు. ఆయన అక్కడ జవహర్లాల్ నెహ్రూ శాంతి బహుమానాన్ని అందుకుంటారు తర్వాత ఖాట్మండులో ఏప్రిల్ 15 దాకా ఉంటారు.

# కొత్తమంత్రులు

## వి. కె. ఆర్. వి. రావు

న్యూఢిల్లీ, మార్చి 13—డాక్టర్ విజయేంద్ర కస్తూరి రంగ వరదరాజరావు, ఇది డాక్టర్ వి. కె. ఆర్. వి. రావు పూర్తి పేరు. వీరు మొన్నటివరకు ప్రణాళికా సంఘంలో, వ్యవసాయం, విద్య విభాగాలకు అజమాయిషీ వహించిన సభ్యులు. లోక్ సభకు ఎన్నిక అగుటకు వీరు ప్రణాళికా సంఘ సభ్యత్వమునకు రాజీనామా చేశారు.

జననం, 1908, జులై 8వ తేదీ కళాశాలా విద్యాభ్యాసం బొంబాయి విల్సన్ కాలేజీ లోను, ఆ తరువాత కేంబ్రిడ్జిలోని గాన్‌విల్ అండ్ కయస్ కాలేజీలోను జరిగింది.

1963 లో ప్రణాళికా సంఘ సభ్యులగుటకు ముందు వీరు వివిధ రంగాలలో ఉన్నత పదవులను అలంకరించారు. 1944—46 లో భారత ప్రభుత్వ ఆహార శాఖలో గణాంక విషయాల డైరెక్టరుగాను, ఆ తరువాత ప్రణాళికా సలహాదారునిగాను పని చేశారు. 47—50 మధ్యకాలంలో సమితి ఆర్థికాభివృద్ధి ఉపసంఘం అధ్యక్షులుగా ఉన్నారు.

1942 నుంచి 57 వరకు ఢిల్లీ స్కూల్ ఆఫ్ ఎకనమిక్స్ తొలి డైరెక్టరుగా పనిచేశారు. ఆ సంస్థను నెలకొల్పింది కూడ వీరే. ఢిల్లీ విశ్వవిద్యాలయం ఉపాధ్యక్ష పదవి కూడ వీరు నిర్వహించారు. వీరు బహుగ్రంథకర్త. ఈ గ్రంథాలలో "భారత దేశంలో ఆదాయం పన్ను" "భారత జాతీయ సంగ్రామం" "భారతీయ ఆర్థిక వ్యవస్థ, యుద్ధానంతరం రూపాయి విలువ" అనేవి పేర్కొనదగినవి వారి గ్రంథాలు

## శ్రీ కె. కె. షా

వీరి పూర్తి పేరు ఖండుభాయి కసాంజీ దాస్ షా, వీరి వయస్సు 59 సంవత్సరాలు. కేంద్ర మంత్రి వర్గంలో మాతన సభ్యులలో వీరు కూడ ఒకరు. వీరికి సమాచార ప్రసార శాఖలు ఇవ్వబడినవి. రాజ్యసభలో ప్రముఖ సభ్యులలో ఒకరు. బి. ఎ. ఎల్. ఎల్. బి. ప్యాసయారు.

జననం,1908, అక్టోబర్, 15. మహారాష్ట్రంలోని గోరేగాం జిల్లా కోలాబాలో జన్మించారు. వీరు మొదట బొంబాయిలో పోద్దార్ హైస్కూలులో ఉపాధ్యాయులుగా తమ ఉద్యోగ జీవితం ఆరంభించారు. 1930 సంవత్సరంలో జాతీయోద్యమంలో చేరారు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నందుకు వీరిని అరెస్టుచేసి నిర్బంధంలోవుంచారు. అనంతరం న్యాయవాద వృత్తి అవలంబించారు చెం. కారు పాత్ కేసులో వీరు మద్దాయి తరువాత న్యాయవాదిగాపనిచేశారు చాలకాలం బొంబాయి ప్రదేశ్ కాంగ్రెసు కమిటీ ప్రధాన కార్యదర్శిగాను, ఉపాధ్యక్షులుగాను, ఆ తర్వాత 1957—60 మధ్య బి. పి. సి. సి. అధ్యక్షులుగాను వున్నారు. 1962—63 లో ఎ. ఐ. సి. సి. ప్రధాన కార్యదర్శి పదవి నిర్వహించారు.

శ్రీ షా 1960 లో రాజ్యసభకు ఎన్నికయ్యారు. తిరిగి 1966 లో కూడా రాజ్యసభ సభ్యులుగా ఎన్నుకోబడ్డారు 1965 లో జవుళి పరిశ్రమ పరిశీలక సంఘం అధ్యక్షులుగా పని చేశారు. 1962 లగాయతు కేంద్ర హోం మంత్రితో సన్నిహిత సంబంధం కలిగి వున్నారు.

## శ్రీ త్రిగుణ సేన్

విద్యామంత్రి శ్రీ త్రిగుణసేన్ సుప్రసిద్ధ విద్యావేత్త. రాజ్యసభ సభ్యుడు. ఆయన జాదవ్‌పూర్ విశ్వవిద్యాలయంలో మాజీ వైస్‌ఛాన్సలర్. విద్యా సంఘం సభ్యుడు. ప్రస్తుతం బనారస్ విశ్వవిద్యాలయం వైస్—ఛాన్సలర్.

## డా॥ ఎం. చెన్నారెడ్డి

హైదరాబాద్ జిల్లా ధరూర్, సిరిపురం గ్రామంలో 1919 జనవరిలో డాక్టర్ ఎం. చెన్నారెడ్డి జన్మించారు. విద్యార్థి దశలో చురుకుగా ఉన్నారు. అనేకమైన స్కాలర్‌షిప్‌లు,బహుమతులు పొందరు. 1941 లో ఎం. బి. బి. ఎస్. డిగ్రీ పుచ్చుకున్నారు.

ఆయనను రాజ్యాంగ పరిషత్‌కు నామినేట్ చేయడం జరిగింది. ఆయన శక్తిసామర్థ్యాలు గుర్తించి కాంగ్రెసు పార్లమెంటరీ సెక్రటరీగా నియమించడం జరిగింది. పిమ్మట హైదరాబాద్ రాష్ట్రంలో రామకృష్ణారావు మంత్రివర్గంలో ఆయన వ్యవసాయ మంత్రిగా ఉన్నారు. ఆఖరుకు 1952 నుంచి 1956 వరకు ఆ పదవిలో ఉన్నారు.

1956 లో ఆంధ్రప్రదేశ్ ఏర్పాటయిన అనంతరం కాంగ్రెసును విడనాడి ప్రతిపక్షాలలో చేరి మేజరిటీ పార్టీకి ఉపనాయకులయినారు. తరువాత కాంగ్రెసులో తిరిగి చేరారు. 1962 ఎన్నికలలో ఆయన కాంగ్రెసు అభ్యర్థిగా పోటీచేసి హైదరాబాద్ జిల్లాలోని తాండూరు నియోజకవర్గం నుంచి శాసనసభకు ఎన్నికైనారు.

1962 నుంచి సంజీవరెడ్డి మంత్రివర్గంలో ఆయన ప్రణాళికా శాఖను నిర్వహించారు.

1966 ఫిబ్రవరిలో శ్రీ బ్రహ్మానందరెడ్డి నాయకత్వంలో ఏర్పడిన మంత్రివర్గంలో డాక్టర్ చెన్నారెడ్డి అదే శాఖను నిర్వహించారు. శాఖలను తిరిగి కేటాయించినప్పుడు డాక్టర్ చెన్నారెడ్డికి ఆర్థిక, మధ్య తరహా, లఘు పరిశ్రమలను కూడా కేటాయించారు.

ఆర్థికమంత్రిగా రాష్ట్రం ఆర్థిక విషయాలలో శ్రీ రెడ్డి అప్రమత్తంగా ఉన్నారు. లఘు పరిశ్రమల రంగంలో గణనీయమైన అభివృద్ధి ఆయన నాయకత్వంలో సాగింది.

## శ్రీమతి పుల్‌రేణుగుహా

సాంఘిక సంక్షేమ శాఖామంత్రిణి శ్రీమతి పుల్‌రేణుగుహా రాజ్యసభ సభ్యురాలు. పశ్చిమ బెంగాల్‌లో సాంఘిక విద్య కార్యకలాపాలలో సుప్రసిద్ధురాలు.

## శ్రీ కె. వి. రఘునాథరెడ్డి

పారిశ్రామిక అభివృద్ధిశాఖామంత్రి శ్రీ కె. వి. రఘునాథరెడ్డి రాజ్యసభ సభ్యులు. న్యాయవాది

## డాక్టర్ ఎస్. చంద్రశేఖర్

ఆరోగ్య కుటుంబనియంత్రణ శాఖామంత్రి డాక్టర్ ఎస్. చంద్రశేఖర్ కుటుంబనియంత్రణ విషయాల నిపుణుడు. ఆయన లోగడ పెన్సిల్వేనియా, పిట్స్‌బర్గ్, మిస్సోరి, కాలిఫోర్నియా మున్నగు అమెరికన్ విశ్వవిద్యాలయాలలో ప్రొఫెసర్‌గా పని చేశారు. ఆయన ఆసియా భారత్‌లలో జనాభా పై పెక్కు గ్రంథాలు వ్రాశారు.

## శ్రీ కిరణ్ సింగ్

పౌరవిమానయాన శాఖ. యాత్రికుల శాఖ మంత్రి శ్రీ కరన్‌సింగ్ జమ్మూ కాశ్మీర్ గవర్నర్. ఆయన జమ్మూ కాశ్మీర్, బనారస్ హిందూ విశ్వవిద్యాలయం వైస్‌ఛాన్సలర్ పనిచేశారు.

# ** దినఫలం **

మాతన వ్యవహారాలకు మార్చి 15 బుధవారం— రాత్రి 8—26 గంటలవరకు తిథి మంచిదికాదు. తరువాత మంచిది ఉదయం 9—5 గంటలవారకు నక్షత్రం మంచిది. తరువాత మంచిదికాదు. 16 గురువారం— తిథి మంచిది. నక్షత్రం మంచిదికాదు. ప్రయాణాలకు: మార్చి 15 బుధవారం— రాత్రి 8—26 గంటలవరకు మంచిదికాదు. తరువాత మంచిది. ఉదయం 9—5 గంటల వరకు నక్షత్రం మంచిది మృత్యుయోగం మంచిదికాదు) తరువాత మంచిదికాదు (కాలయోగం మంచిదికాదు 16 గురువారం— తిథి మంచిది. నక్షత్రం మంచిదికాదు. మధ్యాహ్నం 11—59 గంటలవరకు సిద్ధయోగం మంచిది తరువాత అంబయోగం మంచిదికాదు) (వర్జ్యమును, దుర్ముహూర్తమును గమనించవలెను)

జన్మదిన ఫలం: మార్చి 15—వృత్తి వ్యాపారాల్లో అదృష్టం బాగానే ఉంటుంది కాని తరుచుగా మీరు అనుకొనేది ఒకటి జరిగేది మరొకటి కావచ్చును. ఆర్థిక వ్యవహారాల్లో ముఖ్యమైన టాలను లొంగిపోవడంవలన ముప్పందు ఇబ్బంది కలుగుతుంది. దూర ప్రయాణాలుచేసి కార్యసాధన చేయగలరు. ఉద్యోగంలో మీకు ముమ్మందు ఉపయోగించగల మార్పులు వస్తాయి. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాల్లో అధిక వ్యయం జరుగుతుంది. విద్యార్థులు సాధారణంగా క్షేత్రాల్లు కాగలరు.

15–3 1967 బుధవారం
(శా. శ. 1888 ఫాల్గుణమాసం 24

### మేషం

వృత్తి వ్యాపారాల్లో మీరు ఇదివరకు చేసిన ప్రయత్నాలు ఇప్పుడు ఫలించగలవు రాంఘిక కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. వివాద కలహాల్లో పాల్గొంటారు. భరణి నక్షత్ర జాతకులు మాత్రం జాగ్రత్తగా వ్యవహరించడం అవసరం.

### వృషభం

[illegible] వ్యవహారాల్లో మీరు కొంత [illegible] ఉంటుంది. మీ తాలూకు వస్తువులు పోయే ప్రమాదం ఉంది. ఉద్యోగంలో చికాకులకు గురికాగలరు. మృగశిర నక్షత్ర జాతకులు మిగిలిన వారికంటే జాగ్రత్తగా వ్యవహరించడం చాలా అవసరం.

### మిథునం

ఈ దినం మీ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి వృత్తిలో మాతనావకాశాలు లభిస్తాయి. సమయానికి ఏదో ఒక విధంగా డబ్బు చేతికి వస్తుంది మిత్రులకు సహాయం చేస్తారు పునర్వసు నక్షత్ర జాతకులు మాత్రం జాగ్రత్తగా వ్యవహరించడం అవసరం.

### కర్కాటకం

కొంచెం శ్రమ కలిగినా, అన్ని వ్యవహారాల్లోను అనుకూలత లభిస్తుంది. స్థిరాస్థి వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. దైవకార్యాలు నెరవేరతాయి పుష్యమీ నక్షత్ర జాతకులకు మిగిలిన వారికంటే బాగా ఉంటుంది.

### సింహం

వ్యాపారంలో మీ ఆలోచనలకు తగిన అవకాశాలు లభిస్తాయి వృత్తిలో పోటీదారులను ఎదుర్కొని అభివృద్ధిని సాధించగలరు. సాహిత్య కళా రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది పుబ్బ నక్షత్ర జాతకులకు మాత్రం బాగా ఉండదు.

### కన్య

కొన్ని వ్యవహారాల్లో మీరు ఎంత మంచిగా ప్రవర్తించినా అది ఇతరులకు చెడగానే కన్పిస్తుంది. సాహసముతో కూడిన వ్యవహారాల్లో విఘ్నం వస్తుంది. కుటుంబ వ్యవహారాల్లో భేదాభిప్రాయాలు రావచ్చును హస్త నక్షత్ర జాతకులుమిగిలిన వారికంటే జాగ్రత్తగా వ్యవహరించడం చాలా అవసరం

### తుల

వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు [illegible] నెరవేరతాయి ఉద్యోగంలో గౌరవ ప్రాబల్యాలు బాగా ఉంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది. ఆరోగ్యం బాగా ఉంటుంది. స్వాతి నక్షత్ర జాతకులకు మిగిలిన వారికంటే బాగుంటుంది.

### వృశ్చికం

వ్యాపారంలో కొత్త వారి పోటీని ఎదుర్కోవలసి వస్తుంది. రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాల సంచలనం పెరుగుతుంది. ఆడంబరంకోసం వ్యయం చేస్తారు. పాటివారిలో మాట పట్టింపులు తగవు. జ్యేష్ఠా నక్షత్ర జాతకులు జాగ్రత్తగావ్యవహరించడం అవసరం.

### ధనుస్సు

అన్ని వ్యవహారాల్లోను అనుకూల పరిస్థితులు ఏర్పడతాయి. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభించగలవు. పూర్వాషాడ నక్షత్ర జాతకులకు మాత్రం అనుకూలంగా ఉండదు.

### మకరం

కొన్ని వ్యవహారాల్లో మీ మంచితనమే మీకు ఇబ్బందిని కలిగిస్తుంది. వృత్తిలో ప్రయోజనం లేని శ్రమకు గురికాగలరు. పాటివారిలో గౌరవం లభిస్తుంది. ఆరోగ్యం బాగా ఉంటుంది. ధనిష్ఠ నక్షత్ర జాతకులు జాగ్రత్తగా వ్యవహరించడం చాలా అవసరం.

### కుంభం

అన్ని వ్యవహారాల్లోను మీ ప్రయత్నాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి సాహసముతో కూడిన వ్యవహారాలు కూడా లాభించగలవు. కోర్టు వ్యవహారాల్లోఅనుకూలమైన మార్పులు వస్తాయి. శతభిషా నక్షత్ర జాతకులకు మిగిలిన వారికంటే బాగా ఉంటుంది.

### మీనం

ఇప్పుడు మీరు జరిపే వ్యవహారాలు ముందు ముందు కూడా ఎక్కువ ఉపయోగం ఉంటుంది. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు. వ్యవహారాల విషయంలో అభివృద్ధిని సాధించగలరు. ఉత్తరాభాద్ర నక్షత్ర జాతకులకు మిగిలిన వారికంటేబాగా ఉంటుంది.

— మహేష్

# "ఇకనుండి ఇద్దరు ప్రధాన మంత్రులు"

## —శ్రీ డాంగే వ్యాఖ్య

బొంబాయి, మార్చి 13 : ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధి తిరిగి కాంగ్రెసు పార్లమెంటరీ పార్టీ నాయకురాలిగా ఎన్నికకావటం గురించి వ్యాఖ్యానిస్తూ, మితవాద కమ్యూనిస్టు పార్టీ అధ్యక్షుడు శ్రీ ఎస్. ఏ. డాంగే "దేశానికి ఇక ఇద్దరు ప్రధాన మంత్రులు ఉంటారు. ఒక్కరిద్దరు ఒకరు, వాస్తవంగా ప్రధాని ఒకరు" అని పేర్కొన్నారు.

"ఈ విధంగా అయితే అధికార పక్షంలో సంక్షోభం గాని, దేశంలో కల్లోలం గాని అంత మొందించటం అసాధ్యం, సైనా, అభ్యుదయ కరమైన విధానం, కార్యక్రమం లేక సంక్షోభం యింకా ఎక్కువ అవుతుంది. వామపక్ష ప్రజాస్వామిక సమైక్యతను వ్యక్తి చేసే పక్షంలో, అభ్యుదయ నిరోధక కాంగ్రెసు పార్టీని రెండు సంవత్సరాలలోపే తొలగించవచ్చు. ఇందుకు పార్లమెంటు లోను, బయట ప్రజాస్వామిక సంఘాలను చెందిన మేము శాయశక్తులా ప్రయత్ని స్తాం" అని శ్రీ డాంగే ప్రకటించారు.

## ప్రధానమంత్రికి నాయకుల అభినందనలు

సిమ్లా, మార్చి 13 : కాంగ్రెసు పార్లమెంటరీ పార్టీకి తిరిగి నాయకురాలిగా ఎన్నిక అయినందుకు శ్రీమతి ఇందిరాగాంధికి బీహారు ముఖ్యమంత్రి శ్రీ మహామాయా ప్రసాద్ సిన్హా తన అభినందనలు తెలియజేశారు.

"ఆమె నాయకత్వంలో దేశం సౌభాగ్యవంతం కాగలదని ఆశిస్తున్నాను. ఆమెకు అన్ని విధాలా విజయం చేకూరాలని కోరుతున్నాను" అని శ్రీ సిన్హా తన అభినందనలో తెలియజేశారు.

పంజాబులోని, కాంగ్రెసు, అకాలీ రెండు పార్టీల నాయకులు ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధిని న్యూఢిల్లీలో కలిసికొని ఏకగ్రీవంగా కాంగ్రెసు పార్లమెంటరీ పార్టీ నాయకురాలిగా ఎన్నికయినందుకు అభినందనలు తెలియజేశారు.

వారిలో పంజాబ్ పి. సి. సి. అధ్యక్షులు గ్యాని జెయిల్‌సింగ్, కాంగ్రెసు శాసనసభా పక్షం నాయకుడు శ్రీ రారివాలా, మాజీ ముఖ్యమంత్రులు శ్రీ రాంకిషన్, శ్రీ గురుముఖ్‌సింగ్, ముసాఫిర్, మాజీ మంత్రులు శ్రీ దర్బారాసింగ్, శ్రీ మోహన్‌లాల్, అకాలీ దల్‌కు చెందిన మంత్రి శ్రీ లక్ష్మణ్‌సింగ్ గిల్, పార్లమెంటు సభ్యుడు శ్రీ ఉత్తమ సింగ్ దుగ్గల్ (సంత్—అకాలీ) ఉన్నారు.

ఏకగ్రీవ ఎన్నిక జరిగినందుకు వారంతా ఆనందం వ్యక్తం చేశారు. ఇందు వలన కాంగ్రెసులో ఐక్యం ఏర్పడటమే కాక దేశానికి సుస్థిర ప్రభుత్వం సిద్ధించ గలదని కాంగ్రెసు నాయకులు పేర్కొన్నారు.

## లోక్‌సభ తొలి సమావేశం కార్యక్రమం ఖరారు

న్యూఢిల్లీ, మార్చి 13: పార్లమెంటు తొలి సమావేశం కార్యక్రమాన్ని ప్రభుత్వం నేడు ఖరారు చేసినట్లు తెలుస్తోంది. 18వ తేదీన ఉభయ సభల సంయుక్త సమావేశంలో రాష్ట్రపతి ప్రసంగిస్తారు.

లోక్‌సభా, రాజ్యసభల సమావేశాలు ఏప్రిల్ 7వ తేదీవరకు జరుగుతాయి. రాష్ట్రపతి ప్రసంగం పై చర్చ రాజ్యసభలో మార్చి 20న, లోక్‌సభలో 31న ప్రారంభమవుతుంది.

రాష్ట్రపతి ప్రసంగం అనంతరం ఆ రోజున జనరల్, గోవా, రైల్వేలకు సంబంధించిన అనుబంధపు పద్దులను ప్రవేశ పెడతారు. భూమి స్వాధీనం, ఖనిజసంపద, ప్రజాప్రతినిధుల చట్టం సవరణకు సంబంధించిన మూడు ఆర్డినెన్సుల స్థానే బిల్లులను కూడా ప్రతిపాదిస్తారు.

మార్చి 19, 21, 24, 26, ఏప్రిల్ 1, 2 తేదీలలో సమావేశాలు జరగవు.

25వ తేదీన సభల ఉభయ సమావేశం జరుగుతుంది. ఒక వేళ యిది జరగని పక్షంలో తక్కిన రోజుల కార్యక్రమంలో మార్పులు జరుగుతాయి.

గోవా, రైల్వే బడ్జెట్‌లను ఈ నెల 20న ఉభయ సభలలోను ప్రతిపాదిస్తారు.

24వ తేదీ గుడ్‌ఫ్రైడే కావడంవల్ల ఆ నాటి ప్రయివేట్ సభ్యుల తీర్మానాలను 25న తీసుకుంటారు.

రాష్ట్రపతి ప్రసంగంపై చర్చకు ఏప్రిల్ 6న ప్రధానమంత్రి సమాధానం యిస్తారు.

—o:o—

## 14న రాజస్థాన్ అసెంబ్లీ సమావేశం రద్దు

జైపూర్, మార్చి 13: ఈ నెల 14వ తేదీన జరగవలసిఉన్న రాజస్థాన్ శాసనసభ సమావేశం జరగదని నేడిక్కడ రాష్ట్ర ప్రభుత్వం ప్రకటించింది.

సిమ్లా, మార్చి 13 : హిమాచల్ ప్రదేశ్ ముఖ్యమంత్రిగా ప్రమాణ స్వీకారం చేయనున్న డాక్టర్ పర్మార్ లెఫ్టినెంటు గవర్నర్ శ్రీ వి. విశ్వనాథన్‌ను నేటి సాయంత్రం కలుసుకుని మంత్రివర్గం సభ్యుల జాబితాను సమర్పించారు.

## చైనా, పాక్‌లతో అవగాహన

### ప్రధాని ఇందిర ప్రకటన

న్యూఢిల్లీ, మార్చి 13 : చైనా, పాకిస్తాన్ లతో అవగాహనను సాధించడానికి భారత దేశం తన ప్రయత్నాలను కొనసాగించవలసి యున్నది, ఈ లక్ష్య సాధనకు సహాయపడే చర్యలన్నింటినీ తీసుకోగలదని ప్రధాన మంత్రి శ్రీమతి ఇందిరాగాంధి నేడిక్కడ ప్రకటించారు.

చైనా, పాకిస్తాన్‌లతో పరిష్కారాన్ని సాధించడానికి భారత ప్రభుత్వం కొత్తగా చొరవను తీసుకో గలదా అని విలేఖరులు ఆమెను ప్రశ్నించారు.

శ్రీమతి ఇందిర జవాబిస్తూ, "మా ప్రజాజనాల దృష్ట్యా పొరుగు వారిలో మిత్రులుగా ఉండవలసి ఉంది. దీనిని సాధించ డానికి మేము మా కృషిని కొనసాగిస్తాము. కొన్ని సందర్భాలలో మన నిమిత్తం లేకుండా నాకే ఈ లక్ష్యసాధనకు వీలుకాని పరిస్థితులు ఏర్పడవచ్చు. అయినా ప్రయత్నంలో మనకు విశ్వాసం ఉన్నది" అని అన్నారు.

భారత దేశ విదేశాంగ విధానంలో ఏ అంశాన్ని గురించి కొత్త ప్రభుత్వం ముఖ్యంగా పరిశీలిస్తుందని అడుగగా, ఇప్పుడు పరిశీలన జరుపవలసిన ముఖ్య విధానమేమీ లేదని ఆమె అన్నారు.

అణ్వాయుధాల వ్యాప్తి నిరోధం పరిశీలించవలసిన ముఖ్య విషయం కాదా అని ప్రశ్నించగా, సహజంగా అది ముఖ్యమైన సమస్య అని, అయితే భారత్ వైఖరి సుస్పష్టమే అని ఆమె చెప్పారు.

ప్రతిపక్షాల ప్రభుత్వాలలో కూడా విదేశీ సంబంధాలను గురించి ప్రస్తావన ఉన్నందు వల్లను, పాకిస్తాన్‌తో సంబంధాలను మెరుగు పర్చుకోవాలని వాటిలో కొన్ని భావిస్తున్నందు వల్లను విదేశాంగ విధానం పునర్నిర్మాణం జరిగినప్పుడు ఆ పార్టీలను మీరు సంప్రదిస్తారా అని ఒక విలేఖరి ప్రశ్నించారు.

"మన పొరుగుదేశాల వారిలో సంబంధాలను మెరుగు పరచుకోవాలని మనం ఎల్లప్పుడూ భావిస్తూనే ఉంటాము" అని ఆమె జవాబిచ్చారు.

# దక్షిణ వియత్నాంలో ప్రభుత్వ వ్యతిరేకత

## ఎన్నికలు సమీపిస్తున్న దృష్ట్యా ఎక్కువ అవుతున్నట్టు వెల్లడి

సైగాన్, మార్చి 13: దక్షిణవియత్నాంలో అమెరికా వ్యతిరేక వైఖరితో మిళితమైన అశాంతి, రాజకీయ, మతరంగాలలో చెలరేగు తోంది.

సైనికపాలన స్థానేవచ్చే 6నెలల్లో రాజ్యాంగబద్ధంగా ఎన్నికకాబడే ప్రభుత్వం ఏర్పడటం గురించి, రాజకీయంగా చాల ప్రమాద పరిస్థితికి దరితీయగలదని అభిజ్ఞులైన అమెరికన్ వియత్నాం వర్గాలవారు తెలియజేస్తున్నారు.

ముందు ముందు ఈ క్రింది వర్గాలనుంచి కల్లోలం వ్యాపించే అవకాశం ఉందని, పై అభిజ్ఞవర్గాలవారు తెలియజేశారు.

1. గత ఏడాది ప్రభుత్వమును కూలద్రోయుటకు ప్రయత్నించినవారిలో ఇంకా మిగిలిన ఉన్నకొన్నిశక్తులు హ్యూలోను, దనాంగ్ లోను తిరిగి పుంజుకుని ఒకవర్గంగా ఏర్పడ డానికి ప్రయత్నిస్తున్నవి.

2. "అబద్ధపు శాంతి" ప్రతిపాదనకు వ్యతిరేకంగా సైగాన్, ఇతర నగరాల్లో జరిగే ప్రదర్శనలు అదుపుతప్పే అవకాశం ఉంది.

3. ఇదివరకెన్నడూ లేనంతగా బియ్యం ధర విపరీతంగా పెరగటంవలన జాగా అసంతృప్తి ఏర్పడటం.

4. జాతీయ ఎన్నికలు రానున్న దృష్ట్యా చీలికలు బహుళంగా ఉన్న దక్షిణ వియత్నాం రాజకీయ పార్టీలు అధికారంకోసం పోకులాడటం.

5. అమెరికన్ అధికారులు అనుకొన్నంత తీవ్రంగా విరోధాలను అంతంచేసే జాతీయ పునరైక్యతను పెంపొందించుటకు ఇంతవరకు ప్రధానమంత్రి గుయెన్‌కావోకీ ఆయిష్టంగా ఉండటం.

బవుద్ధులలో తీవ్రవాదులు, జనవరిలో వారి దంగ్ హ్యాంగ్‌వియత్ (వియత్నాం పునఃప్రతిష్ఠావన పార్టీ)కు గోల్డెన్ డ్రాగన్‌పార్టీ అని కొత్త పేరు పెట్టారు.

హ్యూ యూనివర్సిటీలో విద్యార్థులకు సెలవులు వచ్చే నెలలో రానున్న సందర్భంగా, ప్రభుత్వవ్యతిరేక ప్రతిఘటన ఉద్యమమును తిరిగి ప్రారంభించుటకు బవుద్ధులలోని తీవ్రవాదులు ఆలోచిస్తున్నట్లు తెలుస్తోంది.

ప్రార్థనాసమావేశాలు నిద్యార్థి ప్రదర్శనలు సదస్సులు, సమ్మెలు పీటన్నిటిద్వారా యుద్ధమును యుద్ధంలో అమెరికా జోక్యమును చేసుకొనే పద్ధతిని గర్హించుట జరుగుతుందని సైగాన్‌లో యుద్ధం అంటే ప్రీతిగల బవుద్ధ వర్గాలలో జారీ అయిన ఒక ప్రకటనవలన తెలుస్తున్నది.

జనవరిలో గోల్డెన్ డ్రాగన్ పార్టీ తలెత్తిన దగ్గరనుంచీ సైనికప్రభుత్వంలో ఏ విధమైన మార్పు వస్తుందో అని ఆ పార్టీ తీవ్రంగా పరిశీలిస్తున్నది.

సమితిలో అమెరికా ప్రతినిధి ఆర్థర్ గోల్డ్‌బర్గ్ జాతీయ పునరైక్యతను త్వరగా సాధించుటకు కృషిచేయవలసిందని ప్రధాన మంత్రి కీ తో ఇటీవలి తన పర్యటనలో చెప్పారు.

వియత్కాంగ్‌లో ప్రస్తుతం ఉన్నతస్థానాలలో ఉన్నవారిని తిరిగి కలుపుకొనుటకు తలపెట్టబడిన హోపెన్ ఆరమ్స్ కార్యక్రమమును శ్రీ గోల్డ్‌బర్గ్ ప్రశంసించారు. కాని ఇది దక్షిణ వియత్నాం నాయకులకు గిట్టటం లేదు.

గత అక్టోబరులో మనీలా సమావేశంలో ప్రధాని కీ పై కార్యక్రమం గురించి ప్రకటన చేయవలసింది. కాని ఇంకా ప్రధానమంత్రి అట్టి ప్రకటన ఏమి చేయలేదు.

# పోస్టల్ రేట్ల పెరుగుదలకు సూచన: కేంద్రమంత్రి తిరస్కృతి

న్యూఢిల్లీ, మార్చి 14:

**తపాలాశాఖ ఆదాయం పెరగడానికి వీలుగా పోస్టల్ రేట్లను పెంచాలని తంతి, తపాలాశాఖ ఛైర్మన్ చేసిన సూచనను కమ్యూనికేషను, పార్లమెంటరీ వ్యవహారాల కొత్తమంత్రి డాక్టర్ రామ్‌సుభాగ్‌సింగ్ తిరస్కరించారు**

పోస్టల్ రేట్లను పెంచకుండా వుండటమే గాక, శతాంశ నాణేముల పద్ధతిని దృష్టిలో పెట్టుకుని ఆ రేట్లను క్రమబద్ధం చేయాలని కూడా శ్రీ సింగ్ పేర్కొన్నారు. దీన్ని బట్టి పోస్టుకార్డు వెలను ఆరు పైసలుగా నిర్ణయించడంలో పాయింటు స్యం లేదని అన్నారు.

1963 ముందు వున్నట్లుగా పోస్టు కార్డు వెలను అయిదుపైసలుగా వుంచి, రెవిన్యూ స్టాంపువెల పదిపైసలకు పెంచితే రెవిన్యూ ఆదాయంలో నష్టం చాలావరకు భర్తీ కాగలదని సూచించారు.

కేంద్ర కమ్యూనికేషన్ల మంత్రిగా పదవీ బాధ్యతలను స్వీకరించిన తర్వాత డాక్టర్ సింగ్, తంతి, తపాలశాఖ సీనియర్ అధికారుల సమావేశంలో మాట్లాడుతూ పై విషయాలు చెప్పారు.

తాను ప్రతిరోజూ ఆఫీసుకు ఉదయం 9—30గంటలకే వస్తానని, సీనియర్ అధికారులు ఆ విధంగా చేయనక్కరలేదని, 9—30గంటలకు రావటం తనకు అలవాటని ఆయన చెప్పారు.

## 60 లక్షల విలువైన చేతి గడియారాల స్వాధీనం

బొంబాయి, మార్చి 13 : బొంబాయిలోని కఫ్ పెరేడ్ ప్రాంతంలో నిన్న ఉదయం సెంట్రల్ ఎక్సైజు శాఖకు చెందిన నేర నిరోధ సిబ్బంది, మెరైన్ విభాగం సిబ్బంది దొంగతనంగా దేశంలోకి వచ్చిన సుమారు అరవై లక్షల విలువైన చేతిగడియారాలను స్వాధీనపర్చుకున్నారు.

భారతీయ కస్టమ్స్ శాఖలో యింత పెద్ద ఎత్తున ఒక్కచోట గడియారాలు స్వాధీన పర్చుకొనటం యిదే మొదటిసారని ఎక్సైజు వర్గాల వారు చెప్పారు.

కఫ్ పెరేడ్ ప్రాంతంలో సముద్ర తీరాన గస్తీ తిరుగుతుండగా కొన్ని కార్లు అనుమానాస్పదంగా తిరుగుతుండటం తాము చూశామని కేంద్ర ఎక్సైజు అధికారులు చెప్పారు. కఫ్ పెరేడ్‌కు మైలు దూరంలో సముద్రంలు పడిపోయే పడవ ఒకటి తీరానికి వస్తూ కనిపించిందని, తీరాన ఆగివున్న కార్లు లోకి అందులోని వారు ఏదో పెట్టెను మోసుకురా ప్రయత్నించగా తాము గాలిలోకి కాల్పులు జరిపామని, అయితే దొంగ రవాణాను ఆ పారిపోయారని వారు చెప్పారు.

దాబైలోని పర్షియాసింధు శాఖ రేపుర నుంచి ఒక అరబ్ నావలో ఈ సరుకు రవాణా అయినట్లు విశ్వసిస్తున్నామని వారు అన్నారు.

## అవినీతి ఆరోపణలపై దర్యాప్తు

### పశ్చిమబెంగాల్ ప్రభుత్వం కృతనిశ్చయం

కలకత్తా, మార్చి 13 : అవినీతి సంబంధించిన ప్రతి కేసును సమగ్రంగా పరిశీలించి దోషులను పట్టుకోవడానికి ఐక్య సంఘటన ప్రభుత్వం యత్నిస్తుందని పశ్చిమ బెంగాల్ ముఖ్యమంత్రి శ్రీ అజొయ్‌ముఖర్జీ నేడు రాష్ట్ర శాసనసభలో ప్రకటించారు.

రాష్ట్రంలోని కాంగ్రెసు నాయకుల పైన, పదవి విరమణ చేసిన మంత్రుల పైన అవినీతి, లంచగొండితనాలకు పురికా చేసిన ఆరోపణలను పరిశీలించడానికి సుప్రీం కోర్టు న్యాయమూర్తి అధ్యక్షతను దర్యాప్తు సంఘం ఏర్పాటు చేయాలన్న శ్రీ సిద్ధార్థ శంకర్‌రాయ్ (కాం), సూచనకు సమాధానంగా శ్రీ దాను పై విధంగా అన్నారు.



Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press Gandhi Nagar Vijayawada-3. Editor: S. Sambhu Prasad. Phone: Vijayawada 5667, 5226.